PRSVMOR A124

సాహిత్య
ప్రస్థానం
ఫిబ్రవరి 2011
సంపుటి : 11 సంచిక : 62

# నల్లడబ్బు అభయం!

ప్రజల శ్రేయస్సే పరమావధి అంటూ ఎన్నికయిన ప్రభుత్వాలు ప్రజల గురించి ఆలోచించట్లేదు. కార్పొరేట్ వర్గాలకు ప్రయోజనం కల్గించే పని తప్ప సామాన్య ప్రజలకు మేలుచేసే పరిస్థితులు కనపడట్లేదు. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ ప్రసంగంలో అవినీతి దేశ భవిష్యత్తును నాశనం చేస్తుందని పేర్కొన్నారు. ఒక ప్రక్క అవినీతి డబ్బు విదేశాల్లో పేరుకుపోయి దేశ ప్రజల్ని వెక్కిరిస్తుంది. మరో ప్రక్క దేశంలో ధరలు పెరిగి సామాన్య, మధ్య తరగతి ప్రజలు బెంబేలెత్తుతున్నారు. తాజాగా పెట్రోలు ధరలు పెంచారు. ప్రపంచీకరణ విధానాల కారణంగా కోటీశ్వరులు మరింతగా తమ సంపదను పెంచుకున్నారు. ఈ విధానాలు అమలు జరిగిన కాలంలోనే ఎక్కువగా నల్లడబ్బు విదేశీ బ్యాంకుల్లో జమపడిందనే వార్తలు దీనిని ధృవపరుస్తున్నాయి. ఇంత జరిగినా లక్షల కోట్ల నల్లడబ్బుకు సంబంధించి చర్యలు తీసుకోవడానికి పాలకులు మీనమేషాలు లెక్కిస్తున్నారు. పైగా ఆ అవినీతి డబ్బును అక్రమంగా దాచుకున్న నల్ల కుబేరుల పేర్లు బయటకు రాకుండా కాపాడే ప్రయత్నం చేస్తున్నారు. ఆర్థిక మంత్రి ప్రణబ్‌ముఖర్జీ నల్లడబ్బు వివరాలను వెల్లడించలేం అన్నారు. సుప్రీం కోర్టు వివరాలు సమర్పించమంటే ప్రధాన మంత్రి వివరాలు వెల్లడి చేయడానికి ఒప్పందాలు అనుమతించవని వివరణ ఇచ్చారు. నిజానికి విదేశీ బ్యాంకుల్లో నల్లడబ్బు గురించి చర్చ ఈనాటిది కాదు. వర్తమాన సంచలనం అసాంజీ తన వికీలీక్స్ వెబ్‌సైట్‌లో స్విస్ బ్యాంక్‌లో దాచుకున్న నల్లడబ్బు వివరాలను వెల్లడిస్తానని ప్రకటించిన నేపథ్యంలో ఈ పరిణామాలు చోటుచేసుకున్నాయి. ఇలాంటి విపరీత పరిస్థితుల్లో నిజాలు కక్కించగలిగేది ప్రజా చైతన్యమే. ఆ దిశగా ప్రజ కదలాలి.

... ... ...

ఈ సంవత్సరం దేశంలోని అత్యున్నత పురస్కారాలు తెలుగువారిని బాగానే వరించాయి. సలీం నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రావడం సంతోషం కలిగించే అంశం. ఈ పురస్కారం మరోసారి తెలుగు నవలా రచయితలకు ప్రేరణ అయితే సంతోషమే.

... ... ...

మన రాష్ట్ర భవిష్యత్తుపై నివేదికను శ్రీకృష్ణ కమిషన్ కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది. అయినా కేంద్రం నిర్ణయం చేయకుండా అనిశ్చితి కొనసాగడానికి కారణమవుతుంది. ఇప్పటికైనా పరిష్కారానికి చర్యలు తీసుకోవడం అవసరం. ఈలోగా ప్రాంతీయ వివాదాలు ప్రజల మధ్య సమస్యలు సృష్టించకుండా చూడడం ప్రతి వారి బాధ్యత.

ముఖచిత్రం : ఆర్. గిరిధర్ (ప్రత్యేక వ్యాసం 24వ పేజీలో)

బొమ్మలు : శివాజి, వెంకటేష్, కె. శ్రీనివాస్, రవి



## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొర(ప్రసాద్
హిమజ్వాల

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా

సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in

కథ

# జామకాయల శివాలక్ష్మి



మహబూబ్‌నగర్. సికింద్రాబాద్ ప్యాసింజర్ ట్రెయిన్ జడ్చర్ల దాటింది. కాసేపట్లో గొల్లపల్లికి జడ్చర్లలో కాస్త లేటుగా ట్రెయిన్ మూవ్ అయ్యేప్పుడు చివరి కంపార్ట్‌మెంట్ క్యాచ్ చేసిన జువాలజీ లెక్చరర్ సుహాసినీ, కెమిస్ట్రీ లెక్చరర్ పర్వీన్ సుల్తాన్ మాటల్లో పడ్డారు. ఇంతలో "చాయ్! చాయ్! గందీ చాయ్!" అని అరుస్తూ అబ్దుల్లా వచ్చాడు.

**- కుంతి**

"నమస్తే అమ్మా! ఏందీ? సార్లు వేరే డబ్బాలో, మీరు వేరే డబ్బాలో" అంటూ చాయ్ ఇచ్చాడు. "కొంచెం లేటుగా క్యాచ్ చేశాం. దాంతో చివరి డబ్బాలో ఎక్కాం. సార్లందరూ ముందు కంపార్ట్‌మెంట్‌లో ఉన్నారు. అది సరే, అబ్దుల్లా! శివాలక్ష్మి కనబడడం లేదు. రావడం లేదా?" అన్నది సుహాసినీ మేడం. "శివాలక్ష్మి తెచ్చే జామపండ్లు బాగుంటాయి. మా అబ్బాయికీ, అత్తగారికీ చాలా ఇష్టం. ఈ మధ్య కనబడడం లేదు. ఎందుకో?" అంది పర్వీన్ చాయ్ అబ్దుల్లాతో.

"నిన్నటి నుండి కనబడుతుంది. ఈరోజు కూడా వచ్చింది. ఎనక డబ్బాలో చూసిన"

"ఆ వచ్చిందా. చాలా రోజులైంది కనబడక అందుకే అడిగాం" అన్నది సుహాసినీ మేడం.

"మీకు తెల్వదేమోనమ్మా. శివాలక్ష్మిది పెద్ద కిస్సా ఉంది" అన్నాడు అబ్దులా.

"క్యాకిస్సాహై? తోడా హమే బతావో" అన్నది పర్వీన్ మేడం.

"శివాలక్ష్మి వాళ్లది గొల్లపల్లి. రాంరెడ్డి పటేల్ తోటలో వీళ్లమ్మ పనిచేస్తది. అక్కడ పండ్లను ఈమె ట్రెయిన్‌లో అమ్మనీకెవస్తది. నెలరోజుల సంది కనబడడం లేదు. మన సమోస సత్తి లేదు వాడు మొత్తం కతంతా చెప్పిండు. ఈమె ఎవనితోనో పోయిందట. వాడు ఈమెను పెండ్లి చేసుకున్నాడట. పెండ్లి చేసుకున్నాక కూడా యాడేడో తిరుగుతుంటే వాడు దీన్ని వొదిలేసిండంట. నిజానికి అది గందీ హర్కత్ చేసి పోలీసులకు దొరికిపోయిందట. ఆడది గట్ల చేస్తే మగడు ఊర్కుంటడా? నిజమేందో, అబద్ధమేందో నాకైతే తెల్వదు. నిన్నటి నుంచి మళ్ళీ బుట్ట ఎత్తుకొని తిరుగుతుంది." అని చెప్పడం ముగించి, టీ డబ్బులు తీసుకొని అక్కడి ఉండి కదిలాడు...

శివాలక్ష్మి మంచి ఒడ్డూ, పొడుగున్న మనిషి. చామన ఛాయ రంగు. మంచి అవయవ సౌష్ఠవం. పొడవాటి ముక్కు. నడుమును దాటే జడ. పెద్దకళ్లు గుండ్రటి ముఖం. అన్నిటి కంటే మించి పెదవులపై కదలాడే చిరునవ్వు. ఆర్ట్ డైరెక్టర్ సినిమాలో హీరోయిన్‌లా ఉంటుంది. ట్రెయిన్‌లో నిత్య ప్రయాణికులైన కాలేజీ లెక్చరర్‌లు, బ్యాంకు, ప్రభుత్వ ఉద్యోగులు ఈమెను చూసి, "శాపవశాత్తు యే దేవకన్యో ఇలా ఈ రూపంలో తిరుగుతుంది" అనుకునేవారు. జాంపళ్ళూ... జాంపళ్ళూ... అంటూ అరుస్తూ శివాలక్ష్మి వస్తుంటే మగాళ్ళు ఆమె వంకే రెప్పార్పకుండా చూస్తుండేవారు. ప్రయాణికులతో సరదాగా మాట్లాడుతూనే, తాను చెప్పిన ధరకే జామకాయలు అమ్మేది. మగాళ్ళు ఎవరైనా హద్దుదాటి ఆమె శరీరం వంక చూస్తూ, బుట్ట పై చేయి వేసి, "ఈ పండ్లు ఎంతకిస్తావు?" అని వ్యంగ్యంగా అడిగితే ఆమె "పళ్ళు రాలతాయి, బుట్ట మీద అట్ల చేయి పెట్టి ఒత్తకండి" అంటూ గడుసుగా సమాధానం చెప్పేది. కాని మిగిలిన వారితో మర్యాదగా మాట్లాడేది. పిల్లలు పండ్లు కావాలని తల్లుల వద్ద మారాం చేస్తుంటే, ధర తగ్గించి, "పిల్లలు ఏడుస్తున్నారు. పండ్ల ధర ఇవ్వండి చాలు" అంటూ తల్లుల చేత పండ్లు కొనిపించేది.

ట్రెయిన్‌లో నిత్యం ప్రయాణం చేసే ఉద్యోగులు ఆమె దగ్గరే రోజూ జామపండ్లు కొనేవారు. ఆమె మాటకారితనం పద్ధతి నచ్చడంతో సుహాసినీ, పర్వీన్ మేడమ్‌లు ఆమెతో మరింత సన్నిహితంగా ఉండేవారు. పండ్లు అమ్మకం అయిన తరువాత, శివాలక్ష్మి వీరి దగ్గరికి వచ్చి, బుట్టలో బట్ట కప్పి అడుగున దాచిన పండ్లు వారి చేతికిచ్చేది. కాసేపు ముచ్చట్లాడేది. కష్టసుఖాలు చెప్పుకొనేది. తోటివారి కష్టాలు చెప్పి జాలిపడేది. గుడ్డి బిచ్చవాడు సీతారాం కనబడితే నాలుగు జామకాయలు ఉచితంగా ఇచ్చేది.

సుహాసినీ, పర్వీన్ మేడమ్‌లు అప్పుడప్పుడు తమ వార్డ్ రోబ్‌లో కట్టని, మంచి చీరలు తెచ్చి శివాలక్ష్మికి ఇచ్చేవారు. యే సంబంధ బాంధవ్యాలు లేకున్నా శివాలక్ష్మి గురించి కాస్త ఎక్కువగానే ఆలోచించేవారు. కాని, వారు చాయ్ అబ్దుల్లా చెప్పిన మాటలు విని షాక్ అయ్యారు. కానీ కన్విన్స్ కాలేదు. "ఏం జరిగి ఉంటుంది మేడం శివాలక్ష్మి అలాంటిది కాదు" అన్నది పర్వీన్ మేడం. "ఔను! నాకూ అలాగే అనిపిస్తుంది" అన్నది సుహాసిని. ట్రెయిన్ షాద్‌నగర్ చేరుకుంది.



ఇంతలో జాంపళ్ళూ... జాంపళ్ళూ... దోర జాంపళ్ళూ... తియ్యటి జాంపళ్ళూ... అంటూ అరుస్తూ వచ్చింది శివాలక్ష్మి. వీరిని చూసింది. బుట్టలో మిగిలిన జాంపళ్ళూ, ఒకళ్ళిద్దరికి అమ్మి, వీరిదగ్గరికి వచ్చి "నమస్తే అమ్మ! మీ గురించి సార్లనడిగితే ఇక్కడున్నారని చెప్పింన్రు. మీ కోసమే వస్తున్నా" అంటూ ఎప్పటిలాగే అడుగున దాచిపెట్టిన మంచి జామపండ్లను వారిచేతికిచ్చింది. వాళ్ళు ఆ పండ్లను తినసాగారు. బెర్త్ పై స్థలం కావడంతో బుట్ట కింద పెట్టి మేడమ్ వాళ్ళ పక్కన కూర్చుంది శివాలక్ష్మి. ఆమె మెడలో పచ్చగా తాళి కనిపిస్తుంది. ఆమెను చూస్తుంటే ఏదో తెలియని జాలి కలిగింది. భుజం మీద చేయి వేసి, "బాగున్నావా?" చాలా రోజులైంది. కనబడి అంటూ ఆప్యాయంగా అడిగింది.

ఎప్పుడూ నవ్వు ముఖంతో ఉండే శివాలక్ష్మి, ముఖానికి కొంగు అడ్డం పెట్టుకొని, తలదించుకొని, చుట్టుపక్కలవాళ్ళను పెద్దగా గమనించకుండా వీరివైపు తిరిగి ఏడవసాగింది. కాసేపు ఆమెను అలాగే ఏడవనిచ్చారు. కన్నీరు కంటిని దాటితే గుండె బరువు తగ్గుతుందని వారికి తెలుసు. వరదనీరు ఊరిని ముంచెత్తిన తరువాత, కొంత తడువుకు ఎక్కడి నీరు అక్కడికి పోయినప్పటికీ, నీటితో పాటు కొట్టుకువచ్చిన మట్టి, చెత్తాచెదారం, ఒంన్రు అలాగే మిగిలిపోయినట్లుగా, ఆమె కళ్ళ నుండి కన్నీరు బయటికి పోవడం వలన దుఃఖం బయటపడ్డప్పటికే, ఆ బాధకు కారణమైన గాయం ఇంకా ఆ గుండెను అలాగే అంటి ఉంది. శివాలక్ష్మి దుఃఖించడం చూసి పర్వీన్ మేడం విచలితురాలయింది. పూర్తిగా ఆమెను దగ్గరికి తీసుకుంది. దీనితో ఆమె కొంత శాంతించింది.

"బాత్ క్యా హై? మా వల్ల నీకేదైనా మంచి జరిగితే చేస్తాం. డరనేకీ జరూరత్ నహీ హై!" అన్నది పర్వీన్. చెప్పు శివా! ఏంటి? ఏం జరిగింది? నీ గురించి ఏమిటేమిటో విన్నాం. పెళ్ళి కూడా చేసుకున్నట్లున్నావు!" అన్నది ఆప్యాయంగా సహాసినీ మేడం.

గద్గదికమైన గొంతు సవరించుకొని, కళ్ళు తుడుచుకొని శివాలక్ష్మి చెప్పసాగింది.

"మాది గొల్లపల్లి. రాంరెడ్డి తోటలో మా అమ్మ పని చేస్తది. మామ రాజేశం. అంటే మా అమ్మ తమ్ముడు. ఆయనకి చిన్నప్పుడే పోలియోవచ్చింది. కుంటుతాడు. ముఖముపై అమ్మోరు మచ్చలు. నాలుగేళ్ళప్పుడే అమ్మోరు పోసిందట. రాంరెడ్డి పటేల్ కోళ్ళ ఫోరంలో పనిచేస్తాడు. నేను ఆయన తోటలో పండే పండ్లను గీరైళ్ళనే తిరిగి అమ్ముత. గది మీకు తెలుసు. మా పటేలు, మా దొరసాని మంచోళ్ళు. వచ్చే ఎండకాలం నాకు, మామకు లగ్గం కూడా చేస్తమన్నరు. కాని నా దిమాకే గడ్డితిన్నది. ఏరుక తినే బుద్ధి. లత్కోరు ఏషమేసిన ఈ మధ్య గీ రైళ్ళనే రాజు అనెటాయన కలిసిండు. ఒకసారి శంషాబాద్ స్టేషన్ల, నిండ పండ్ల బుట్ట ఎత్తుకొని రైలెక్కుతున్న ఇంతల రైలు కదిలింది. లబ్బరు చెప్పు జారింది. అంతే బుట్టతోపాటు నేను జారిన. తలుపు దగ్గర కడ్డీని రెండు చేతులతో బిగ్గిత పట్టుకున్న ఒక కాలు డబ్బాకు ప్లాట్‌ఫారమ్‌కు చేతుల నుండి బుట్ట ఎప్పుడో జారిపోయింది. చేతులు పట్టుతప్పుతున్నాయి. కొద్దిల్లు పూర్తిగా పడిపోయేదాన్ని ఇంతలో ఒకాయన మంచి పొడుగున్నాడు. ఉరుక్కుంటూ వచ్చి రెండు చేతులతో నన్ను పట్టుకొని పైకి లేపి అట్లనే ప్లాట్‌ఫారమ్ మీదికి తీసుకొచ్చి బెంచ్‌మీద కుచోబెట్టిండు. గట్ల పరిచయమైంది. ఆ తరువాత ఒకటి రెండు సార్లు రైళ్ళనే కలిసిండు. మంచిగా మాట్లాడెటోడు. మంచి గుంటడు కూడ. కాచిగూడ స్టేషన్‌లో పోర్టర్‌గా పనిచేస్తున్నాను అన్నాడు. లైసెన్స్ బిళ్ళ కూడా చూపించిండు. ఒకరోజు పెండ్లి చేసుకుందాము నాతో వస్తవా? అన్నాడు. మా మామ మంచోడు. కాని కుంటోడు. ముఖం మంచిగుండదు. గీయన మంచిగుంటడు. ''సరే'' అన్నా. మా ఇంట్ల చెప్పకుండా రాజుతో పోయిన. యాదగిరిగుట్టకాడ పెండ్లి చేసుకున్నాం. హైదరాబాద్ బేగంపేట మక్తలకు తీసుకుపోయిండు. నన్నక్కడ ఒక కమరాల పెట్టిండు. ఒక వారం రోజుల తర్వాత మా మామకు నేను ఫోన్ జేసిన. అమ్మా మామ నా తానికి వచ్చింన్రు. మా అమ్మ నన్ను ఒక చగ్గ తిట్టింది. కాని మా మామ పట్టుచీర తెచ్చిండు. చేతిల వెయ్యి రూపాయలు పెట్టిండు. నాకెట్లనో అనిపించింది. ఆ తరువాత వాళ్ళు వెళ్ళిపోయింన్రు. కాని నాకు ఒక్క వారంరోజుల్లనే తెలిసొచ్చింది. మా మక్తల చుట్టుపక్కల ఉండెటోళ్ళంత నా దిక్కు అదోలాగ చూసెటోళ్లు. ఒకళ్ళిద్దరిని "ఏంది సంగతి?" అని అడిగిన. ఒక పెద్దామె చెప్పింది. "మీ ఆయన రాజు మంచోడు కాదు పచ్చి తాగుబోతు. ఇంతకు ముందు కూడా ఇద్దరు ముగ్గురిని ఇట్లనే ఇంటికి తెచ్చిండు. ఆడోళ్ళెంబడి తిరుగుగతాడు. ఒకటి రెండుసార్లు బస్తీవాళ్లు నీ మొగుణ్ణి పట్టుకొని కొట్టింన్రు కూడా. నీ మొగుడు నీకేం చెప్పిండో కాని దొంగతనాలు కూడా చేస్తాడు. మస్తుసార్లు పోలీసులు పట్కపోయి బొక్కలు చూర చూర చేసింన్రు. నా బిడ్డ లెక్కున్నావు. కొంచెం జాగ్రత్తబిడ్డా!" అన్నది. ఆ రోజే రాజు బాగా

తాగి వచ్చిండు. నేను బాగ నిలదీసిన నన్ను బాగా కొట్టిండు. నేను ఎదురు తిరిగిన. తెల్లారిన తరువాత కాళ్ళు పట్టుకున్నాడు. "నేను అసంటోణ్ణి కాదు. గిట్టనోళ్ళు చెప్పిన మాటలు పట్టుకోవద్దు" అని యేడ్చిండు. నేను నమ్మిన. రెండు రోజుల తరువాత "నీ కోసం కష్టపడి దాచిన పైసలున్నాయి. నీకు బొంబాయి చూసిస్త అన్నాడు. "మునుపు ఎసంటోడైనా, ఇప్పుడైతే మంచిగానే ఉన్నాడు గదా" అనుకున్నా. గొర్రె కసాయోణ్ణి నమ్మినట్లు నమ్మిన నన్ను బొంబాయి తీసుకుపోయిండు. నన్నొక హోటల్ రూమ్‌లో పెట్టిండు. ఒక రోజంతా తిప్పిండు. రెండోరోజు పొద్దునే నాకిక్కడ తెల్సినోళ్ళున్నారు. గిప్పుడే వస్తానని బయటికి పోయిండు. నన్నొక రోజంతా వాడు ఇక రాలేదు. అగ రాలేదు. కడుపల ఆగం బుట్టింది. బగ్గ బుగులైంది. సాయంత్రం ఆరుగొట్టంగ ఇద్దరు మనుషులు వచ్చింగ్రు. రాజుకు ఆక్సిడెంట్ అయింది" రమ్మన్నారు. నాకు కాళ్లు చేతులు ఆడలేదు. ఎక్కడ తొయ్యలేదు. వాళ్ళెంబడి పోయిన, వాళ్ళెక్కడెక్కడికో తీసుకొని పోయింగ్రు. నాకు భయం పుట్టింది. "ఆక్సిడెంట్ అయ్యింది అన్నారు. గిటెటో తీసుకుపోతుంగ్రు ఏంది?" అన్నాను. "ఏంలేదు గి దగ్గర బంగ్లల ఇంగో దోస్తున్నాడు. వాణ్ణికూడ తీసుకుపోవాలి" అన్నారు. సందులల్ల, గొందులల్ల తిప్పి, ఒక బంగ్ల దగ్గర ఆపింగ్రు. అక్కడ అన్నిపాత బంగ్లలె. ప్రతి బంగ్ల ముందు కొందరు ఆడోళ్ళు. మిద్దెలమీదా, కిందా నిలబడి ఉన్నారు'. నాకు 'ఇదేందో ఉన్నదిరా' అనిపించింది. వాళ్ళు కారు ఆపి, నన్ను దిగమన్నారు. "నేను దిగను రాజు ఉన్నతానికి తీసుకుపోండి" అన్నాను. ఇంతలో ఇద్దరు అక్కడికి వచ్చింగ్రు. నన్ను నలుగురు కలిసి గొరగొర గుంజుకుపోయింగ్రు. లోపల పెద్ద హాలు అక్కడ ఆడమనిషి కూర్చోని ఉంది. ఇంతల లోపల్నుండి నా మొగుడు వచ్చిండు. ఆయనకేం కాలేదు. హట్టాకట్టా వున్నాడు. నాకు మొత్తం అర్థమైంది. నా మొగుడు "దీన్ని తీసుకొ మస్తుగున్నది. ఎంత కమాయించుకుంటవో అంతే కమాయించుకో, నా పైసల్ నాకియ్యి" అని ఆడమనిషితో అన్నాడు. నాకొక్కసారి కోపమొచ్చింది. "ఒరేయి లంజకొడకా, పెండ్లాన్ని అమ్ముకుంటావురా బద్మాష్ ఎంత మంది నిట్ల మోసం చేసినవురా. మాదర్చోత్ నీకు అమ్మలక్కలు లేరురా వాళ్ళను గూడ గిట్లనె అప్పజెప్పుతవుర లంబ్డి కొడుక. నీవు మనిషివేనరా ప్రేమించినను, బాగ చూసుకుంటను అని దేవుడు తాన ఒట్టుపెట్టుకున్నావు కదరా లుచ్చా. కడుపుకు అన్నం తింటున్నవ, గడ్డి తింటున్నవ. నీ కాలు చేతులిగ్గ, నీ పీనుగెల్ల" అని బాగ తిట్టిన ఎడమ కాలి చెప్పు తీసి మొకము మీద ఇసిరికొట్టిన ఇంతలో నన్ను తీసుకొచ్చినోళ్ళు నన్ను బాగా కొట్టింగ్రు. నన్ను కొడుతుంటే ఆడోళ్లు రూములల్ల నుండి బయటకు వచ్చి చూసింగ్రు. ఎవరు వచ్చి ఆపలేదు. తాళి కట్టినోడు, జీవితాంతం కాపాడాల్సినోడు గిట్ల చేసిండు. ఇగ లోకానికేంది. వాళ్ళు కొట్టిన కొట్టుడుకు, నోటి నుండి ముక్కుల నుండి రక్తం కారుతున్నది. నన్నొక రూములకు నూకి తలుపు పెట్టింగ్రు.



నేను గట్టిగ లొల్లి పెట్టిన కేకలు పెట్టిన ఉన్నోలందరిని నూటొక్క తిట్లు తిట్టిన. ఇంతనమ్మి, అందరిని వదిలి, వీడెంబడి వస్తే గింత మోసం చేసిండేందని బాధయింది. ఏడుపొచ్చింది. యేడ్చిన, యేడ్చి... యేడ్చి ఎప్పుడు నిద్రపోయిననో నాకే తెల్వదు. చప్పుడయింది మేలుకయింది భయమైంది. ఎంతరాత్రయిందో తెల్వదుగాని, బయటంత చీకటిగా ఉంది. ఒక ఆడమనిషి నా యాడు ఆమె లోపలికి వచ్చింది. వస్తూనే నోటి మీద వేలు వేసి, "చుప్" అన్నట్టుగా చూపిస్తూ, నా దగ్గరికి వచ్చి కూర్చుంది. వస్తూనే నోటి మీద వేలు వేసి, ఒక బాటిల్‌ల నీళ్ళు, ఇంకొక గ్లాసుల వేడిపాలు, కొద్దిగా బన్ను ఇచ్చి తీసుకో అన్నది. నేను ఆమె ఎవరో? ఏందో? అని భయంగా చూసిన. ఆమె ఇంకా దగ్గరికి వచ్చి మెల్లగా చెప్పింది. "నా పేరు కమల మాది ఆంధ్రప్రదేశ్. నేను నీలాగే మోసపోయి ఇక్కడికి వచ్చినాను. కొంచెము బన్ను తిను. పాలు త్రాగు. ఈ బిల్డింగ్ వెనుక అంతా గడ్డి. పిచ్చి చెట్లున్నాయి. ఒక చిన్న గోడ వున్నది. నీవు ఎక్కిదుంకవచ్చు. దానిపైన సీసపు పెంకులున్నాయి. గోడపైన ఇనుప వైరు రెండు వరుసలుంటది. నీవు ఎట్లనన్న గోడ ఎక్కి, ఇనుప వైర్ల మధ్య దూరితే బయటికి రోడ్డు కనబడతది. గోడ ఎక్కి వైర్ల మధ్య దూరి అటువైపు దూకితే చాలు నీవు ఇక్కడ నుండి బయటపడతావు. రోడ్డు చివర్లో పోలీస్ స్టేషన్ ఉంది. అక్కడ హనుమాండ్లు అని ఒక పోలీసాయన ఉంటడు. ఆయనకు తెలుగు వస్తది. నేను నిన్న ఎట్లనన్న ఆ గోడదాక తీసుకుపోత అక్కడ నుండి నువ్వు పారిపో. ఈ పాలు తొందరగ తాగు. ఈ బన్ను తిను" అన్నది. నాకు ఆమె మాట నమ్మాలో నమ్మొద్దో అర్థం కాలేదు. కానీ ఆమెను చూస్తే మోసం చేసే దానిలా అనిపించలేదు. పాలు తాగిన ఆమె నన్ను గారాత్రి ఎనక నున్న చెట్ల చాటు నుంచి కొంత దూరం తీసుకుపోయి, కాంపౌండ్ గోడ దగ్గరికి వచ్చింది. నేను గోడ ఎక్కిన ఆమె కూడా ఎక్కింది. ఇద్దరమూ గోడ దూకాము. కాళ్లకు, చేతులకు సీసపు పెంకులు గుచ్చుకు పోయినయి. ఇనుప వైరు ఒంటికంతా గీరుకుపోయింది. "తొందరగ వెళ్ళిపో" అన్నది. నాకైతే ఆమె దేవతలాగ అనిపించింది. జాకెట్లోంచి వెయ్యిరూపాయలు తీసి ఇచ్చింది. ఈ డబ్బు గంట క్రితం ఒకడిదగ్గర పండుకుంటే వచ్చింది. "తీసుకో" అన్నది. నేను ఎనక ముందు అయిన. తీసుకో చెల్లె. నేను పాపిష్టి బతుకు బతుకుతున్న కాని పాపిష్టిదాన్ని కాదు" అన్నది. "నీవురా అక్కా! పోదం" అన్న. "ఈ పాడులోకములోకి వచ్చిన నేను చెడిపోయిన. ఇక్కడే చచ్చిపోత ఎవరైనా చూస్తే నీకు, నాకు కష్టం. వెళ్ళిపో" అని తొందరపెట్టింది. ఆమె మళ్ళీ గోడదుంకి, లోపలికి పోయింది. నేను ఒక్క తీరుగ ఉరికిన ఆమె చెప్పినట్లే కొద్ది దూరంలో పోలీస్‌స్టేషన్ ఉంది. లోపలికి పోయిన. నాకు కొంచెం హిందీ తెలుసు. వాళ్ల తోటి హిందీలో మాట్లాడిన. హనుమాండ్లు సార్ గురించి అడిగిన. ఆయన ద్యూటీలో ఉన్నడు. వచ్చిండు. ఆయనకు దండం పెట్టి జరిగినదంతా చెప్పిన. "నీవేమి భయపడవద్దు. నిన్ను జాగ్రత్తగా

## జనవరి నెల పురస్కారాలు



### వరం

కథకు........రూ.700/-

రచయిత : బరకు



### గ్రంథాలయం

కవితకు.......రూ.500/-

రచయిత : సోమిశెట్టి వేణుగోపాల్

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

ఇంటికి పంపిస్తము. మీవాళ్ళ ఫోన్ నెంబర్ ఉంటే ఇవ్వు. తెలియజేస్తము" అన్నడు. మా మామ ఫోన్ నెంబర్ ఇచ్చిన ఆ సార్, వెంటనే మా మామకు, ఆంధ్రాలో ఉన్న పోలీసులకు చెప్పిండు. తెల్లారి రాత్రికల్లా ఆంధ్రా పోలీసులు. మా మామ అక్కడికి వచ్చింద్రు. హనుమాండ్లు సార్ నన్ను ఉన్న పూట "చెల్లె" లాగ చూసింద్రు. పోలీసులను కాటకం మనుషులు అనుకుంటాం. కాని హనుమాండ్లు సారును, అక్కడున్న మిగిలిన పోలీసులను చూస్తే అది తప్పనిపించింది. అక్కడి నుండి రెండు రోజుల్లో హైదరాబాద్ వచ్చిన మా అమ్మకు విషయం చెప్పిన. బిగ్గితే పట్టుకొని యేడ్చింది. "నేను చచ్చేంత వరకు కడుపుల పెట్టుకొని సాకుత. నీవు నిమ్మలంగా ఉండు బిడ్డ." అన్నది. మా పటేల్, పటేలమ్మ కూడా చాలా బాధపడ్డారు. మా పటేల్ "నీ పని నువ్వు చూసుకో నీ పొట్ట నీవు నింపుకో" అన్నడు. గట్లయింది నా కథ అంటూ చెప్పడం ఆపింది. "అది సరే. పెళ్లి చేసుకున్నావు. మళ్లీ మొగుడు ఎప్పుడైనా వస్తే వెళతావా? అతడితో కాపురం చేస్తావా? అతడిని క్షమిస్తావా?" అని అడిగింది సుహాసినీ మేడం.



"మొగుడా? వాడా? పెళ్ళాన్ని ముండలకు అప్పజెప్పెటోడు. మొగుడా? వాడు నాకు మళ్ళీ కనిపిస్తే గ్యాస్ నూనె పోసి తగలబెడతా. లేకుంటే కత్తి తీసి నరుకుతా. వాడిని చంపి జైలుకుపోత గాని, వాడితో కలిసి ఉండను" అన్నది. ఆవేశంలో నువ్వు ఎదుర్కొన్న మానసిక క్షోభలో అలాగే అంటుంది. కాని నెమ్మది నెమ్మదిగా కోపం పోయి మళ్ళీ ఆయనే కావాలి అనిపిస్తే వెళతావా? అన్నది పర్వీన్. లేదమ్మా ఎట్టి పరిస్థితుల్లో అది జరగదు. ఈ పుస్తె కూడా ఎందుకు మెడలో ఉంచుకున్నానంటే. అది లోకం కోసం నేను లేచిపోలేదు. బోగం పని చెయ్యలేదు. మనిషిని నమ్మిన. దేవుని గుడిలో పెండ్లి చేసుకున్నా కాపురానికి పోయిన, అని చెప్పడానికి, జీవితంలో ఒంటరిగా బ్రతకడానికి ఆధారంగా ఉండటానికి" అని స్థిరంగా అన్నది.

"ఆ మాటల మీదే నిలబడు. నీ మనసు కనుక్కుందామని అట్ల అడిగాము. నీ కత వింటున్నప్పటి నుండి నా మనసు రగులుతోంది. మా అన్నకు చెప్పి వాడిని ఎక్కడున్నా పట్టుకొచ్చి ఊచలు లెక్కపెట్టిస్తాను. మా అన్న పంజాగుట్ట పోలీస్ స్టేషన్‌లో సర్కిల్ ఇన్స్పెక్టర్. అంతెందుకు నీ గురించి ఎంత పెద్ద పోరాటమైన నీ వైపున నిలబడి పోరాడుతాను." అన్నది సుహాసిని మేడం. "ఔను శివాలక్ష్మి! నీవేం దిగులుపడకు. నీకు మేమున్నాము. ఆ రాజు ఎక్కడ ఉన్నా పట్టుకొద్దాం. వాడి బొక్క - బొక్క, చూరు చూరు చేద్దాం. లేకుంటే మరెందరో నీలాంటి అమాయకమైన ఆడపిల్లలు వాడి ఉచ్చులోపడి వేశ్యాకూపపు రొచ్చులో పడతారు" అన్నది పర్వీన్ మేడం.

"అది బాగానే ఉంది. కాని నీ పరిస్థితి ఏమిటి? అన్నది సుహాసిని మేడం శివాలక్ష్మితో.

ఏమున్నది మేడం! దేవుడాలాంటి మామ ఉన్నాడు. మా నాయనను నేను చూడలేదు. కాని మా మామ అంత కంటె ఎక్కువ. మా మామను కాదని పోయినందుకు దేవుడు మంచిగానే శిక్ష వేసిండు. మంచి మనసున్న పటేలున్నడు. ఆయన తోటల పండ్లున్నాయి. నాకు రెక్కలున్నయి. నా నెత్తిమీన బుట్టన్నది. ఈ రైలు తిరుగుతుంది. దాని పొంటె నేను తిరుగుతా" అంటూ లేచింది. మిగిలిన జాంపళ్లు అమ్మడానికి.

జాంపళ్లూ... జాంపళ్లూ... దోర జాంపళ్లూ... అంటూ ముందుకు సాగిపోయింది. స్త్రీలపై జరిగిన అనేక అత్యాచారాలకు, అమానుషాలకు సాక్ష్యంగా నిలచిన పట్టాలపై రైలు పట్నం వైపు పరుగెడుతోంది. ●



## నిద్ర

- డా॥ ఎన్. గోపి

అంతా బాగానే వుంది
అయినా నిద్ర రాదు
తలుపులు మూసే వున్నాయి
మేడపై నుంచి దూకేసిందో!
ఉన్నచోటే అంతర్ధానమయ్యిందో!!
ఎప్పుడూ దీనిది ఇదే తంతు

గదినిండా
రెక్కలు తెగిన కలలు
కనురెప్పలకు
మెలకువ చేసిన గాయాలు
చీకటి బండరాయిగా మారి
ఛాతిపైకెక్కి చేసే విన్యాసాలు,
ఆవులింతలతో
గాలి వేడెక్కిపోతుంది.
ఎక్కడికెళ్ళిందో తెలియదు
పిలిచినా పలకదు
అలిగిందా!
బుద్ధి తెలిసి ఎవరినీ నొప్పించని నేను
నిద్రనెలా నిందిస్తాను
అయినా తోడుంటానని చెప్పి
తుర్రున ఎగిరిపోయింది.

ఎక్కడి కెళ్ళింది?
అనంత సముద్రాల్లో
తుఫాను కుట్రలను కనిపెట్టాలనుకుందా
రహదారులపై
నేర రహస్యాలను విప్పాలనుకుందా
బంధనాలను ఉత్పత్తి చేసే
దుష్ట ప్రభుత్వాల ఫ్యాక్టరీలను
తనిఖీ చేస్తుందా
జైలు గోడల మధ్య
పాతరేయబడ్డ కాలాన్ని
కదిలించాలనుకుందా
దెబ్బతిన్న మానవత్వాన్ని
జబ్బ పట్టుకొని లేపాలనుకుందా
బెడ్‌షీట్ మీది పక్షి బొమ్మలకు
ఎగరాలని ఆరాటం
దుప్పటి కుంపటిగా మారిన వైనం
నాకే కాదు
నిద్రకూ నిద్ర రాదు
ఎప్పుడూ నా దోసిట్లో
గుప్పెడు అక్షరాలు పెట్టే
నిద్రకు నా కృతజ్ఞత

## ఒక మార్మిక లోయ



- వి. ప్రతిమ

నీటి అద్దపు నిగనిగల్లో
కదిలిపోతున్న నల్ల మబ్బుల్ని
దొరికించుకోవడానికి... ఆమె
నారు నాటుతోంది.
అప్పుడప్పుడూ ఆమె
నటిస్తోందనుకుంటాం...
పనిమీద ఏకశ్రద్ధ
నీటితో, వాగుల్లో, మబ్బుల్తో
గాలి అలలతో సయ్యాటవుతుంది
వంచిన నడుం ఎత్తకుండా
శ్రమ స్పందనలని
పాట పాదాలు చేసి
గాలితో కలిపి శ్వాస కదిలిస్తుంది.
పైకెగసిన గంధర్వ పరిమళం
ఎరువై నారుకు పైరు చేస్తుంది
ఆమెని చూసినప్పుడల్లా
తెలీని, అర్థంకాని భావమేదో
అల్లుకుపోయి ఉక్కిరిబిక్కిరయిపోతా
ఆమె కాళ్ళల్లోని కదనశక్తినీ
ఆమె చేతుల్లోని యంత్రశక్తినీ
కొలవడానికి ఏ కాల నాళికను
అరువు తేవాలి?
ఆమె మార్మిక మనోయవనిక మీద
నాట్యం చేస్తోన్న వెలుగు నీడల్ని
దర్శించడానికి
ఏ ఆత్మ చక్షువుల్ని ఆశ్రయించాలి?
ఆమె చలన సౌందర్యాన్ని
అనువదించడానికి
ఏ కాలపు నిఘంటువుల్ని తవ్వుకోవాలి?
ఆమె జీవన చిత్తరువు గీయడానికి, ఏ
పికాసో దగ్గర శిష్యరికం చేయాలి?
బిగించి కట్టిన మూటల్లాంటి మనుషులు
వదులొదులుగా వున్న ఆమె
లోపలి మనిషిని వెదకడం సాధ్యమేనా?



## ఒంటరి పడవ

- సలీం

ఏటి ఒడ్డుని కావలించుకు
పడుకున్న పడవ
కలవరింతల నిండా
అలల కవ్వింతల కబుర్లే
కాలాన్ని లాక్కొచ్చి
తీరం గాటికి కట్టేసినట్లు...
నీళ్ళ దారెంట
నిత్య చలనశీలి
యిపుడు నిశ్చల మౌన ముద్రలో
వలలో చిక్కుకున్న జలపుష్పాలు
కలలో కన్పించి కన్నీరు కారిస్తే
దుఃఖ సముద్రంలా పడవ
వీపుకు అతుక్కుపోయిన
జాలరి పొట్ట గుర్తొచ్చి
కన్నీటి చెలమైన చిట్టితల్లి
అలల తాళ్ళ మీద ఉయ్యాలలూగి
అలసి యిసుక తల్పం మీద
ఆదమరచి నిద్రిస్తున్న నీటిపాప
అప్పటిదాకా ఆకాశంలో ఈదులాడి
కినిసి కిందికి జారి నేల తల్లి ఒడిలో
అలక తీర్చుకుంటున్న జాబిల్లి తునక
గట్టుని కాటేసే నీటికాళింది మీద
ఎగిరి నాట్యం చేసే కొయ్య క్రిష్ణుడు
అల లతాంగినుల
తనూస్పర్శకు దూరమై
దుఃఖిస్తున్న ప్రేమికుడు
విరహంతో వేగి వేగి
గడ్డ కట్టుకుపోయిన స్వాప్నికుడు
తెప్ప కన్రెప్పల మీద
వయ్యారంగా వాలిన
మంచు సుందరి చీరంచు
మెల్లగా కరుగుతున్న
నిశికాంత కళ్ళ కాటుక
సూర్యోదయం కోసం
ఎదురుచూసేది
ఎండలో వెండి జలతారులా మెరిసి మురిసే
ఏటి పయ్యెదే కాదు
నీటి చెలిమి కోసం
రాత్రంతా తపో సమాధిలో గడిపిన
ఒడ్డునున్న ఒంటరి పడవ కూడా



# నా మూలాల్ని మర్చిపోలేదు

## - సలీం

**2010 సంవత్సరానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించిన 'కాలుతున్న పూలతోట' నవల ఎపుడు రాశారు?**

కాలుతున్న పూలతోట నవల నవ్య వారపత్రికలో ధారావాహికంగా వెలువడి 2006లో పుస్తక రూపంలో వెలువడింది.

**ఎయిడ్స్ అంశాన్ని నవలా ఇతివృత్తంగా ఎంచుకోవడానికి కారణం ఏమిటి?**

ప్రస్తుతం ప్రపంచాన్ని వణికిస్తున్న అతి పెద్ద సమస్య హెచ్ఐవి/ ఎయిడ్స్. చాపకింద నీరులా విస్తరిస్తున్న ఈ సమస్యని సమర్థవంతంగా ఎదుర్కోకపోతే ఒకట్రెండు దశాబ్దాల్లోనే సగం ప్రపంచ జనాభా తుడిచిపెట్టుకుపోయే ప్రమాదం పొంచి వుంది. అందువల్ల ఈ సమస్యని నవలా ఇతివృత్తంగా తీసుకుని హెచ్.ఐ.వి./ఎయిడ్స్ రోగుల పట్ల సమాజంలో నాటుకుపోయిన భయాలు, తద్వారా ఆ రోగుల పట్ల పెరుగుతున్న నిరాదరణ, అసహ్యం... చివరికి రక్త సంబంధీకులను సైతం వదిలించుకునేంత అమానవీయత... వీటిని చిత్రించాను.




**నవల రాయడానికి ప్రేరణ ఏమిటి? ప్రత్యేక అధ్యయనం, కృషి ఏమైనా చేశారా?**

ఈ నవల రాయడానికి ప్రేరణ భయం గురించి నేను విన్న ఓ కథ. మశూచి అమ్మవారు ఆ వూళ్ళో తన వల్ల ఐదుగురు మాత్రమే చనిపోతారని ఓ స్వామీజీకి మాటిస్తుంది. కానీ మశూచి సోకి యిరవై మంది చనిపోతారు. స్వామీజీకి కోపం వచ్చి నువ్వు మాట తప్పావని అమ్మవారితో అంటే 'నావల్ల చనిపోయింది ఐదుగురే. మిగతా పదిహేను మంది భయంతో చచ్చిపోయారు' అని సమాధానం చెప్తుంది. హెచ్.ఐ.వి./ఎయిడ్స్ వ్యాధి కన్నా వ్యాధి ఉందేమోనన్న భయం వల్లనే ఎక్కువ నష్టం జరుగుతోంది. అందుకే ఈ నవల ద్వారా భయంతో సమస్య నుంచి పారిపోవడమో, ఆత్మహత్యలకు పాల్పడటమో చేయకుండా ధైర్యంగా ఎదుర్కోవడం మంచిదని నాగమణి పాత్ర ద్వారా చెప్తూనే భయం వల్ల జీవితంలో ఏం కోల్పోవాల్సి వస్తుందో కుమార్ పాత్ర ద్వారా చెప్పాను.

ఇది వైద్య పరిజ్ఞానానికి సంబంధించిన విషయం కాబట్టి నవల రాయడానికి ముందు ఇంటర్నెట్ నుంచి చాలా సమాచారం సేకరించాను. డాక్టర్ సమరం ఎయిడ్స్ మీద రాసిన పుస్తకం చదవడమే కాకుండా కొంతమంది వైద్యుల్ని సంప్రదించాను. డయాగ్నోస్టిక్ సెంటర్ల వారి నుంచి కూడా సమాచారం సేకరించాను. హెచ్.ఐ.వి./ఎయిడ్స్ పేరు వినగానే మృత్యువు ఎదురుగా నిలబడి వున్నట్లు భయానికి లోను కావడం, వైద్య వృత్తిలో ఉన్న వ్యక్తులు కూడా తాకడానికి, వైద్యం చేయడానికి నిరాకరించడం, పిల్లల్ని స్కూల్ నుంచి పంపించి వేయడం, సమాజం వెలి వేయడం యివన్నీ పేపర్లలో పలుమార్లు చదివిన వార్తలు కాబట్టి వాటిని నవల్లో అనువైన చోట వాడుకున్నాను.

**ఈ నవల హిందీ అనువాదం గురించి చెప్పండి?**

ఈ నవలని హిందీలోకి ప్రముఖ అనువాదకురాలు శ్రీమతి శాంత సుందరి 'నయా ఇమారత్ కే ఖండహర్' పేరుతో అనువదించారు. ఇది 'స్వతంత్ర వార్త' హిందీ దినపత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఆ తర్వాత మేధ బుక్స్, న్యూఢిల్లీ వాళ్ళు పుస్తక రూపంలో ప్రచురించారు. ఈ అనువాదానికి 2009లో జాతీయ మానవ హక్కుల కమిషన్, న్యూఢిల్లీ వారి పురస్కారం లభించింది.

**అవార్డు రావడంపై మీ స్పందన?**

ఆ వార్త విన్న వెంటనే హృదయం నిండా ఆనంద నృత్య హేల. కల సాకారమైన భావన. ఈ అవార్డు రావడం రచయితగా నా బాధ్యతని మరింత పెంచింది.

**మీరు రాసిన ఇతర నవలల గురించి చెప్పండి?**

మొదటి నవల జీవన్ మృతులు (2001). కార్పొరేట్ ఆసుపత్రులు రోగుల అమాయకత్వాన్ని, భయాల్ని ఆసరాగా చేసుకుని ఎలా దోచుకుంటున్నాయో వివరించిన నవల. రెండో నవల వెండి మేఘం (2003). ఇందులో ముస్లిం జీవన చిత్రణ, వాళ్ళ ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, మతపరమైన కట్టుబాట్లు, అభద్రతా భావంతో పాటు దూదేకుల దయనీయమైన స్థితిని, వాళ్ళు ముస్లిం సోదరుల నుంచి

ఎదుర్కొంటున్న పరాయీకరణని చిత్రించడం జరిగింది. మూడో నవల కాంచన మృగం (2006) యిది మీడియా మాయాజాలం వల్ల తమ విలువైన జీవితాల్ని నష్టపోతున్న యువతీ యువకులకు హెచ్చరికగా రాసిన నవల. నాలుగో నవల కాలుతున్న పూలతోట (2006). ఐదవ నవల పడగనీడ (2010). ఇది ప్రస్తుతం 'నది' మాసపత్రికలో ధారావాహికంగా వెలువడుతోంది. ఇందులో మన రాష్ట్రంలో ఉన్న ఎంసెట్ మానియా గురించి, దానివల్ల నష్టపోతున్న విద్యార్థుల గురించి, తల్లిదండ్రుల ఆశల్ని సొమ్ము చేసుకుంటున్న కార్పొరేట్ విద్యాసంస్థల గురించి చర్చించటం జరిగింది.

**వర్తమాన తెలుగు సాహిత్యంపై మీ స్పందన?**

కవిత్వం, కథ వెలిగిపోతున్నాయి. ముఖ్యంగా తెలుగు కథ మన జీవితాల్లోని అనేకానేక పార్శ్వాల్ని ప్రతిభావంతంగా చిత్రిస్తూ తన విశ్వరూపాన్ని ప్రదర్శిస్తోంది. ఎటొచ్చీ నవలకు ఆదరణ తగ్గింది. చదివేవాళ్ళూ తగ్గారు... నవలల్ని ప్రచురించే వాళ్ళూ తగ్గారు.




**మీ రచనా నేపథ్యం గురించి చెప్పండి?**

స్కూల్లో చదివే రోజుల్లో కవిత్వం రాసేవాణ్ణి. ఒంగోల్లో సమర సాహితి అనే సాహితీ సంస్థని నడిపేవాళ్ళం. దీన్ని ప్రారంభించి నన్నూ, నాలాంటి చాలామందిని ఆ రోజుల్లో ప్రోత్సహించిన వ్యక్తి శ్రీరామకవచం సాగర్. యూనివర్శిటీ రోజుల్లో కథలు రాయడం ప్రారంభించాను. ఆ తర్వాత నవలల్లోకి వచ్చాను. నా నవలలకు బాగా పేరొచ్చినా నాకు కథలంటేనే ఎక్కువ యిష్టం.

**ప్రస్తుతం నవలా సాహిత్యం ఎక్కువగా రాకపోవడంపై మీ అభిప్రాయం?**

జీవితాల్లో పెరిగిన వేగం... వస్తు వ్యామోహం... తక్కువ సమయంలో ఎక్కువ డబ్బు ఎలా సంపాదించాలనే తాపత్రయంలో సాహిత్యానికి కేటాయించే సమయం కరువైపోయింది. రెండొందల పేజీల నవల చదివే తీరికా, ఓపికా ఉండటం లేదు. పత్రికాధిపతులు, సంపాదకులు కూడా కొంత కారణం అనాలి. మంచి నవలల్ని ప్రచురించడానికి ఉత్సాహం చూపడం లేదు. సరదాగా చదివించే నవలలు, క్రైం సస్పెన్స్, శృంగార నవలలు వీటికే ఎక్కువ ప్రాముఖ్యతనిస్తున్నారు.

**నేటి సాహిత్యానికి పాఠకుల ఆదరణ కొరవడటానికి మీరు చెప్పే కారణాలు ఏమిటి?**

విద్యార్థుల్లో తెలుగు భాష మీద మక్కువ లేకపోవడం... పరభాషా వ్యామోహం, హ్యారీపోటర్ నవల రిలీజవుతుంటే కొనడానికి క్యూలు కట్టే యువతకి తెలుగులో ప్రసిద్ధ సాహితీవేత్తలెవరో తెలియకపోవడం విచారకరం.

**కమర్షియల్ నవలా సాహిత్యంపై మీ అభిప్రాయాలు?**

స్కూల్లో చదివే రోజుల్లో నేను మొదట చదివిన సాహిత్యం డిటెక్టివ్ సాహిత్యమే. చాలా విస్తృతంగా చదివేవాణ్ణి. ఆ తర్వాతే చలం సాహిత్యం, బుచ్చిబాబు చివరకు మిగిలేది. నవీన్‌గారి అంపశయ్య చదివి మంచి సాహిత్యం వైపుకు మళ్ళడం జరిగింది. కమర్షియల్ నవలా సాహిత్యం సమాజానికి మంచి చేయకున్నా పర్లేదు, చెడు చేయకుండా ఉంటే చాలు.

**మీ రచనల్లో తాత్విక చింతన, మానసిక సంఘర్షణ, మానవ అనుబంధాల వంటి వాటిపై తగిన శ్రద్ధ కనబడుతుంది. కారణం?**

పాత్రల మానసిక సంఘర్షణని ప్రతిభావంతంగా చిత్రించినపుడే పాఠకుడికి కళ్ళెదురుగా జరుగుతున్న సంఘటనతో పాటు వాళ్ళ మనసుల్లోకి తొంగిచూసే అవకాశం దొరుకుతుంది. ఇది రచనా ప్రక్రియలో మాత్రమే సాధ్యం. దృశ్య మాధ్యమంలో కష్టమైన విషయం. మానవ సంబంధాలు నేడు మృగ్యమైపోతున్నాయి. మానవతా విలువలు మచ్చుకైనా కన్పించని రోజు వస్తుందేమోనన్న భయం.. అందుకే అనుబంధాల్లోని తీపిని, మానవత్వంలోని మాధుర్యాన్ని నా రచనల్లో చెప్పే ప్రయత్నం చేస్తుంటాను.

**వివిధ వైరుధ్యాలతో కూడిన సాహిత్య రంగంలో అందరి ఆమోదాన్ని ఎలా పొందగలుగుతున్నారు? మంచి మనిషిగా విభిన్నంగా ఎలా కొనసాగగలుగుతున్నారు?**




నా పేదరికం నాకు అణుకువని నేర్పింది. జీవితంలో ఎన్నో ఆటుపోట్ల నెదుర్కొన్న నేను ఈ రోజు మంచి స్థితిలో వున్నా నా మూలాల్ని మర్చిపోలేదు. కొందరి దయకు పాత్రుడినై వాళ్ళ చేయూతతో పైకొచ్చిన విషయాన్ని ఎన్నడూ మర్చిపోలేదు. ఆకలితో పోరాడుతున్న రోజుల్లో నన్నాదుకున్న మనుషులు నేర్పిన మంచితనం, మానవత్వం నాకు మనుషుల్లోని దైవత్వం మీద నమ్మకాన్ని పెంచాయి.

**మీ 'రాణిగారి కథలు' మాటీవీలో సీరియల్‌గా ప్రసారమై మంచి ప్రాచుర్యాన్ని పొందింది కదా. చక్కటి లౌకిక భావజాలాన్ని వ్యాప్తి చేసిన ఆ సీరియల్‌పై మీకెలాంటి ఫీడ్ బ్యాక్ వచ్చింది?**

చక్కటి స్పందన వచ్చింది. లేడీ విలన్లు, కొట్టుకోవడాలు, పళ్ళు కొరుక్కోవడాలు, పగలు ప్రతీకారాలు లేకుండా హాయిగా ఉంటూనే మంచి సందేశాన్ని అందించిందని ప్రేక్షకులు చాలా మంది చెప్పారు.

## భగవంతుడి జన్మస్థానం

**బెంగాలీ మూలం : స్వప్నిల్**

**తెలుగు : వేదుల రామకృష్ణ**

దేశంలో ఇన్నాళ్ళ తరువాత
భగవంతుడి జన్మస్థానం ఎక్కడని
వెతకటం మొదలైంది
ఈ పుణ్యక్షేత్రం నుండి కొన్ని
మైళ్ళ దూరంలో, ఎక్కడైతే
పురాతన నది ప్రవహించేదో,
ఆ దగ్గరలోనే ఉంది
భగవంతుడి జన్మస్థానం
అంటున్నారు పురాతత్వవేత్తలు!
'నా అధికారపీఠం దగ్గరే ఉన్నది
భగవంతుని జన్మస్థానం'
అంటున్నారు రాజకీయవేత్తలు!



ప్రజలకు ఇదమిద్ధంగా తెలియదు
భగవంతుడి జన్మస్థానమెక్కడున్నదని
వారు పురాతత్వవేత్తల రాజకీయ వేత్తల
అభిప్రాయాల మధ్య దిగ్భ్రమలో ఉన్నారు
ఇద్దరికీ చెప్పటం ఇష్టం లేదు
భగవంతుడు ఎక్కడ పుట్టాడో
రహస్యం బైట పడితే
ఇద్దరి అస్తిత్వాలకి ముంపు వాటిల్లుతుంది
అందుకే ఇప్పటి వరకు
రహస్యంగానే ఉంది
భగవంతుడి జన్మస్థానం

---

## ఓ మహిళ

**హిందీ మూలం : పురుషోత్తం సత్యప్రేమి**

**అనువాదం : పి. కృష్ణ**

ఓ మహిళా!
మహాత్ములెందరో నీ గురించి ఉద్యమించారు
కానీ నీ హక్కులు నీకు అందలేదు
నిన్ను వంశ గౌరవాల బంధుత్వాల
గొలుసులతో బంధించారు
అస్త్ర శస్త్రాలు చూపి భయపెట్టారు
నీ చేతిలో చెయ్యేసి నడిచిన వాళ్ళే
నీ దారికి ఎదురాళ్ళవుతున్నారు
సాయమందివ్వాల్సిన చెయ్యే
నీ గొంతు నొక్కుతుంది
అయినప్పటికీ ఓ మహిళా!
అంతులేని అమానవీయ చేష్టల నడుమ
బండరాళ్ళ గుండెల్ని చీల్చుకొని
పచ్చని మైదానంలో
మందారంలా వికసించాలి నువ్వు!



---

మతాంతర వివాహం చేసుకున్న కొన్ని జంటలకు 'రాణీగారి కథలు' పుస్తకాన్ని బహుమతిగా యిచ్చినట్టు కొంతమంది ఫోన్లు చేసి చెప్పడం బట్టే ఈ సీరియల్ లక్ష్యం నెరవేరిందన్న తృప్తి కలిగింది.

**టీవీలో నేడు ప్రసారమవుతున్న ఎక్కువ సీరియల్స్‌లో హింస, మహిళలను విలన్లుగా చూపించడం, హాస్యాస్పద సస్పెన్స్ వంటివే వున్నాయి. వాటి స్థానంలో 'రాణీగారి కథలు' వంటివి మంచి ప్రయోజనం కలిగిస్తాయి కదా. ఇటువంటి సాహిత్యం ఎక్కువగా టీవీ సీరియల్స్‌గా రావాలంటే ఎలాంటి ప్రయత్నం జరగాలి?**

దానికి ముందుగా పూనుకోవాల్సింది టీవీ యాజమాన్యం. మసాలా లేని మంచి సీరియల్స్ తీసినా ప్రేక్షకులు ఆదరిస్తారన్న నమ్మకం వాళ్ళకు కలిగించగలిగితే యిటువంటి కథా వస్తువుల్ని తీసుకోవడానికి ముందుకు వస్తారు. రాణీగారి కథల విషయంలో 'మాటీవీ' వాళ్ళు అటువంటి నిర్ణయం తీసుకుని ప్రోత్సహించినందుకు యాజమాన్యానికి కృతజ్ఞతలు. ఓ ట్రెండ్ సెట్టర్‌గా నిలిచిపోయే సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నందుకు ముఖ్యంగా సాయిప్రసాద్‌గారికి, పాలగుమ్మి సీతగారికి ధన్యవాదాలు చెప్పుకోవాలి.

**ఉద్యోగ బాధ్యతల మధ్య రచనా వ్యవసాయం ఎలా చేయగలుగుతున్నారు?**

ఎక్కువగా రాత్రిళ్ళు నిద్ర మేల్కొని రాయటం అలవాటు కాబట్టి రచనా వ్యాసంగానికి నా ఉద్యోగ బాధ్యతలు ఎప్పుడూ అడ్డు రాలేదు. నేను నిర్వర్తించాల్సిన సంసార బాధ్యతల్ని కూడా తన నెత్తిమీద వేసుకుని సమర్థవంతంగా నిర్వహిస్తూ నా సాహితీ వ్యాసంగానికి సహకరించే నా భార్యకు ఈ విషయంలో రుణపడి ఉంటాను. ప్రతి పురుషుడి విజయం వెనుక ఓ స్త్రీ ఉంటుందో లేదో తెలీదు కాని నా ప్రతి విజయం వెనుక ఉన్నది నా భార్య డా॥ గీత. నాకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రావాలని నాకంటే ఎక్కువగా కోరుకుని, రానపుడు నాకంటే అమితంగా బాధపడి, తీరా వచ్చాక నాకంటే ఎక్కువగా సంతోషపడిన వ్యక్తి డా॥ గీత.

**మీ వ్యక్తిగత వివరాలు?**

పుట్టిన ఊరు ఒంగోలు దగ్గర త్రోవకుంట గ్రామం. చదువు : ఎంఎస్సీ (టెక్) 'ఆంధ్రా యూనివర్సిటీ', వాల్తేర్‌లో పదవతరగతి వరకు 'పి.వి.ఆర్.' స్కూల్‌లో, ఇంటర్ 'శర్మా' కాలేజీలో చదివాను. డిగ్రీ కర్నూలులోని 'సిల్వర్‌జూబ్లీ' కాలేజీలో చదివాను. ఉద్యోగం : ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్‌లో 'డిప్యూటీ కమిషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్'. 1982 నుండి నివాసం హైదరాబాద్. భార్య గీత, పిల్లలు నీహారిక, మధూలిక.

(ఇంటర్వ్యూ : **వీరప్రసాద్**

# మడుసులుండే ఊరి కోసం

- కె. ఆనందాచారి

ఊరు గొడ్డుపోయింది
ఓ నీళ్ళూ లేవు, నిప్పులూ లేవు
నడసిన పాదాల ముద్దరలతో
ఇండ్లకు రమ్మని పిలిచే రహదారులూ లేవు!



మనుషుల జాడలేక
గింజలు కానరాక
ఎండిన కొమ్మలపై ఎంతకాలముంటమని
సిలకలూ, పచ్చులూ
ఆసల రెక్కల్ని ఆకాసంలో ఎగరేసి
వలస దారిపట్టాయి!

ఇప్పుడే కాదు
ఎప్పటి నుండో ఊరు మహ సెడ్డదయిపోయింది
అందుకే మేము ఈ ఊరవతలే వుంటున్నాము!
ఊరంటే మడుసులుండాలి
మడుసులంటే మనసులుండాలి కదా!

కోటలు పోయినై - గడీలు పోయినై
కాంక్రీటు ఇనుప మేడలొచ్చినయ్
ఊర్ల రోడ్లన్నీ గిట్ల సమానంగా నున్నగా పర్చిండ్రు!
అయినా మడుసుల మద్దెన సమస్యలు తొల్గిపోలే
ఊర్ల మడుసులున్నట్లే లేదు, ఉన్నా కలిసుండట్లే!
సమానంగా లేని మడుసుల మద్దెన
యెన్ని రోడ్లు యెట్లుంటేంది?
అందుకే మేమింకా ఊరవతలే వుంటున్నాం!
మడిసి వుండేందుకింత గూడు కావాలె
గూడంటె సుట్టూ గోడ, పైనింత కప్పు,
గదులూ, అరలూ అన్నీ కావాలి! నిజవే కానీ
గీ మడుషుల యిడదీసే గోడలేంటి?
అరలు, తెరలు గల గుండె గదుల్లో
అందరూ మడుసులేనన్న స్పందనే లేదు!
తాతల, తరాల నుండి
యిది వున్న యేడుపే గానీ
సొతంత్రంగా యేలుబడి మొదలైనంక
యెంతో యెలుగొస్తుందని
కండ్లల్ల వొత్తులేసుకుని సూస్తనే వున్నాం!
యింకా గా అంబేద్కరయ్య
యేలెత్తి సూపిస్తేనే... వున్నదు మారాల్సిన బత్కుల వైపు!

మారుస్తామన్న పాటలు మహ యినిపిస్తూనే వున్నయ్
కానీ మారేదెట్లన్నదే తెలుస్త లేదు!
మమ్మలేరుగ సూసేటోళ్ళు
మాకేం జేస్తరు
మా ఓట్లతో గద్దెలెక్కినోళ్ళు సమాధానం సెప్పాలి!
వుండటానికి యింటి కోసం
గింత జాగా యివ్వనోళ్ళు
మమ్ముల్నందర్నీ సమానంగా సూసే జాగా
ఆళ్ళ గుండెల్లో యెక్కడుంటది?

ఆళ్ళ మనసుల్లో సీకట్లు పోకున్నా
వాళ్ళిండ్ల నిండా కరెంటు దీపాలే!
మా యాదిల మడుషుల యెలుగు తప్ప
చీకటంతా పరచుకున్న బతుకులే

మా కోసం తీసి సూపిన డబ్బుల్ని
వాళ్ళ సోకుల కోసం వాడబట్టే
మా బతుకు బాగుల కండ్లపై
ప్రచారాల దుమ్ముకొట్టి
మా హక్కుగా దక్కే భాగంపై
అధికారపు కబ్జాతో కోత కోసి
నిర్లక్ష్యపు తేనె పూసిన కత్తుల్ని దూస్తున్నరు!
మేమంతా చేతులు కలిపి
పిడికిళ్ళు బిగుస్తున్న వేళ
మా వీధి మధ్యలోనే విభజన గోడ లేపి
మా గూడాన్నే ఒక రణ క్షేత్రంగా జేసిన్రు

నెత్తురు పారని యుద్ధంలో
కత్తులు పట్టని శత్రువుల
కనపడని కుట్రల యెత్తుల్ని
కనిపెట్టే యత్నం మొదలైంది!

ఓ వూరి జనులారా!
ఊరు మరీ గొడ్డుబోయింది
యేలుబడీ చెడ్డదయింది
మడుషులు మడుసుల్లోంచి
పారిపోయిన ఊరినిడిచి
మాతో కలవండి!

మడుసులంతా యేకమై
మేకవన్నె పులుల్ని తరుముదాం!
మా వీధులిప్పుడు
ధీరులకు దారి సూపుతున్నయ్!

# వైవిధ్యభరితం ఇనాక్ సాహిత్యం

- డా॥ కె. ఆశాజ్యోతి



**ఆచార్య ఇనాక్ సాహిత్యమంతా స్వయంగా జీవించిన, అనుభవించిన, చూసిన జీవితమే! జీవితాలే! సమాజ గత దౌర్బల్యాల పట్ల సానుభూతి, జీవుని వేదనలోని గాఢత ఆచార్య ఇనాక్‌ని కవిగా, రచయితగా, నాటకకర్తగా, వ్యాసకర్తగా, కథకుడిగా, నవలాకారుడిగా, విమర్శకుడిగా, పరిశోధకుడిగా బహుముఖీన ప్రతిభాశాలిగా నిలిపాయి. కుల మతాలకు అణగారిన ప్రతి వ్యక్తి తరపునా వకాల్తా పుచ్చుకుని సాహితీ భిత్తికను జీవనవేదనామయ దృశ్యాలకు నిలయాలుగా నిలపగలిగిన ఘనత ఆచార్య ఇనాక్‌ది.**

దళితుడిగా పుట్టి, పెరిగి, జీవిస్తూ ఏడు దశాబ్దాలుగా సమాజంలో పీడనకు గురైన సముదాయానికి విస్తారమైన సాహితీ సేవ చేస్తూ దళితుడుగా గుర్తింపు పొందినా ప్రతీ అణగారిన వ్యక్తికి, కుల మత ప్రాంతీయ భేదాల్లేని సాహితీ వ్యవసాయానికి తనదైన పరిధిలో తోడ్పాటునందిస్తూ ఒక జాషువా, ఒక బోయిభీమన్న, ఒక కొలకలూరి ఇనాక్ అని అనిపించుకొని ఆర్థిక సామాజిక "కట్టదుల్ని" తెంచి మానవీయ "కొలుపుల్ని" మకుటాయమానం చేస్తూ "కులవృత్తులే వైనా "ఇదా జీవితం" అని నిస్పృహ చెందవలసిన అవసరం లేదనీ "అస్పృశ్య గంగ" అంటూ లేదనీ, "ఇరులలో విరులు" "ఆశాజ్యోతు"లనీ, 'ఊరబావు'లూ, "మునివాహనులూ' "అభ్యుదయ వాహికలనీ, సాహిత్య "సమీక్షణం షరామామూలేననీ, "సౌభాగ్యవతి", "సౌందర్యవతులు" "సమతలనీ", "అనాథ" లెవరూ లేరనీ వారు "జోత్య" లేననీ, "కులం - ధనానికి" దృష్టి అవసరమనీ, "ఎక్కడుంది ప్రశాంతి" అంటూ 'కీ' అందించి 'శూద్రకవి శుభమూర్తి వసుచరిత్ర వైశిష్ట్యానికి' 'ఆధునిక సాహిత్య విమర్శ సూత్రానికి' 'తెలుగు వ్యాస పరిణామానికి' గులాబి నవ్వింద'న్నా 'సమత', 'భవానీ'లకు 'సాహిత్య దర్శిని షరామామూములే' అయినా 'రెండు కళ్ళు మూడు కాళ్ళు' ఎవరివని ప్రశ్నించినా, 'త్రిద్రవ పతాకం' voice of silence ని పలకరించినా, 'జానపదుల విమర్శ' అది ఆంధ్రుడుతో పోటీపడ్డా, 'సర్కారుగడ్డి' 'అనంతజీవనాన్ని' చూసినా - ఏం రాసినా, ఎంత రాసినా తరగని గని! కరుణ రసాలధుని! ఆవేశాలను జయించిన ధ్వని! అంటరానితనాన్ని త్రోసిరాజన్న దళిత సాహిత్య విపణి! ఏదనీ - ఎంతనీ - ఏమనీ - ఎవరినీ - ఎలా అనీ - ఏమో అనీ- ఎంతైనా అనీ - ఎంతకైనా నిలువగలనని నిరూపించుకునీ, ఘనుడనీ అనిపించుకున్న దళిత సాహితీవేత్త ఆచార్యకొలకలూరి ఇనాక్.

"నా ప్రేమకు శబ్దం లేదు
నా వేదనకు నిశ్శబ్దం లేదు"
ఇది ఆచార్య ఇనాక్ ఉవాచ!



కన్నీళ్ల వారసత్వానికి ఒంటరి ప్రతినిధై, నలుగురి నవ్వులకు బహుముఖీనుడై, తేట ముఖుడై సాహితీ మర్మజ్ఞతను ప్రపంచానికి అందించిన ప్రజ్ఞావశీలి ఆచార్య ఇనాక్.

మూడో తరగతి మానేసి, ఏడో ఏట జీతగాడిగా కుదిరి గొడ్లుగాసినా, తొమ్మిదో ఏట ఫస్టుఫారం చేరడంతో బతుకు గాడిన పడింది. ఇరవయ్యేళ్లకి ఉద్యోగంలోకి చేరింది జీవితం. పేదరికం, బీదరికం నేర్పిన జీవతపు ఆకలి పాఠాల నుండి ఆచార్య ఇనాక్ జీవన దృక్పథం. ప్రాపంచిక దృష్టి నిగ్గు తేలాయి! నిగ్గు తేలిన ఆలోచనలు సాహితీ క్షేత్రంలో భిన్న దృక్పథాలకు మూల కర్తలయ్యాయి.

ఆచార్య ఇనాక్ సాహిత్యమంతా స్వయంగా జీవించిన, అనుభవించిన, చూసిన జీవితమే! జీవితాలే! సమాజ గత దౌర్బల్యాల పట్ల సానుభూతి, జీవుని వేదనలోని గాఢత ఆచార్య ఇనాక్‌ని కవిగా, రచయితగా, నాటకకర్తగా, వ్యాసకర్తగా, కథకుడిగా, నవలాకారుడిగా, విమర్శకుడిగా, పరిశోధకుడిగా బహుముఖీన ప్రతిభాశాలిగా నిలిపాయి. కుల మతాలకు అణగారిన ప్రతి వ్యక్తి తరపునా వకాల్తా పుచ్చుకుని సాహితీ భిత్తికను జీవనవేదనామయ దృశ్యాలకు నిలయాలుగా నిలపగలిగిన ఘనత ఆచార్య ఇనాక్‌ది.

పరిణామశీలత సమాజ లక్షణం. పరిణామం సహజ లక్షణం. సహజంగా పరిణమించే కాలగతిలో అసహనంగా సమాజంలో పాతుకుపోయిన అంశాలు ఎన్నో! "కుల వ్యవస్థ" అందులో ఒకటి. దళిత కులంలో పుట్టి అనుభవించిన వేదనాభరితమైన జీవితానికి, కులం పేరుతో ఛిద్రమవుతున్న మానవ సమూహాలను ప్రతిఫలిస్తూ, వివరిస్తూ రాసిన ఊరబావి, కట్టడి, కాకి, ఆకలి, పిండికృతశాటి, పశ్చాద్భూమి, విఘ్నవినాయకుడు, తలలేనోడు, అస్పృశ్యగంగ, విపర్యయం,కొలుపులు, గొడ్డదొంగ, కులవృత్తి వంటి కథల్లో సమాజంలో ప్రజ్వలిస్తూనే ఉన్న అంటరాని సమస్య, దేవాలయ ప్రవేశ బహిష్కరణ, దళితులు పొందే అవమానాలు, భూమి సమస్య వల్ల కలిగే ఏక పక్ష నిర్ణయాలు, ఊరికి దూరంగా ఆవాసాలు, వృత్తుల ఆధారంగా బ్రతికే జీవుల

బడబాగ్నుల వెతలు, అవిద్య వల్ల అభ్యుదయం లేని గుంపుగా మిగిలిపోయే దళితులు, దళితుల్లో మరింతగా అణచివేయ బడుతున్న దళిత స్త్రీలు, రిజర్వేషన్ల ప్రతిఫలాలు సంపూర్ణంగా అందుకోగల స్థాయిలో లేని దళితజీవులు, దళిత సంస్కృతి అటరాని సంస్కృతిగా శతాబ్దాలుగా మిగిలిపోతూనే ఉన్న వైనం, దళితులపై సాగుతున్న ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ వివక్షతో కూడిన దాడులు వివరిస్తూ ఈ అంశాల పట్ల అవగాహన, చైతన్యం కలిగిస్తూ ప్రతిఘటించవలసిన అవసరాన్ని తెలిపే రచనలు చేసిన ఆచార్య ఇనాక్ "దళిత దృక్పథం" కలిగిన రచయిత. కేవలం కథా సాహిత్యంలోనే కాకుండా అనంత జీవనం, సర్కారుగడ్డి వంటి నవలల్లో కూడా ఈ పంథా ప్రతిఫలిస్తుంది.




"స్త్రీవాద దృక్పథం" కలిగిన రచయితగా ఆచార్య ఇనాక్ బలమైన స్త్రీ గొంతుకను తన కథలలోని స్త్రీ పాత్రల ద్వారా అందించారు. ఇనాక్ రచనల్లోని స్త్రీ పాత్రలు ఎక్కువగా దళిత, ఇతర తక్కువ కులాల స్త్రీ పాత్రలుగాని ఉంటాయి. అగ్రవర్ణాల స్త్రీ పాత్రలు అక్కడక్కడ మాత్రమే కనబడతాయి. రచయిత దళిత స్త్రీ పాత్రలను సాహసోపేతమైన, చైతన్యవంతమైన పాత్రలుగా చిత్రిస్తాడు. దళిత స్త్రీ సగటు మగాడికి, దళిత మగాడికి ధీటుగా నిలబడే స్త్రీ! పురుషాధిక్య శక్తులతో పోరాడి విజయం సాధించే పాత్రలు ఆచార్య ఇనాక్ కలం నుండి సహజంగా మొలకలెత్తాయి. ఈ లక్షణాలను ప్రతిఫలించే కథలు మచ్చుకి కొన్ని - ఊరబావి, విపర్యయం, గమ్యం, డౌరీడెత్, బర్త్ సర్టిఫికెట్, పిల్లని కంటాను, రమ నా కూతురు, విముక్తి వంటి కథలు. ఇతివృత్త వైవిధ్యం, పాత్రచిత్రణా నైపుణ్యం, కథా శిల్పం వంటి అంశాలతో దళిత స్త్రీ సహజత్వాన్ని సలక్షణంగా వెలికితీస్తాయి. ఈ పాత్రలు సగటు మనిషికి, మగాడికి పోటాపోటీగా నిలుస్తాయి.

"బహుజన వాద దృక్పథం" కలిగిన వ్యక్తిగా కూడా ఆచార్య ఇనాక్‌ను ఆయన రచనల ద్వారా చూడవచ్చు. చాకలి,మంగలి, కుమ్మరి, నేసేవాళ్లు, బలిజలు, కురబలు, ఎరుకలు, ఏనాదులు, వడోళ్ళవంటి ఎన్నో ఇతర కులాలు - వాటి మధ్య వైరం - వైవిధ్యం - సయోధ్య వంటి అంశాలు విఘ్ను, వినాయకుడు, ఊరబావి, విపర్యయం మొదలైన కథల్లో గమనించవచ్చు. "మెదడు వాపు"కు పందులను చంపకుండా మందులు లేదా వాక్సిను కనుక్కోమని చెప్పడంలో ఎరుకుల జీవనాధారం దెబ్బతినకూడదన్న బాధ ఉంది. మూగజీవాల పట్ల దళితులకు ఉన్న ఆత్మీయత తెలిపే కథ. "ముట్టడి"! పాదపూజ మధ్య తరగతి జీవితాన్ని తెలిపితే, "లేబరోళ్ళ" యువతకు కర్తవ్యాన్ని బోధించే కథ. తల్లి చనిపోయి మనవరాలిగా పుట్టినట్టుగా తెలిపే కథ "మా అమ్మే' జంద్యాన్ని తాకట్టు పెట్టే కథ "తాకట్టు".

ఇలా చెప్పుకుంటూ పోతే ఆచార్య ఇనాక్ సాహిత్యంలో కనబడే వైవిధ్యం అద్భుతం. కాకి కులవృత్తి, ఎర్నీళ్లు, గంగాస్నానం. ఊరబావి. తలలేనోడు, వంటి కథలు, మునివాహనుడు, జైహింద్ వంటి నాటకాలు, షరామామూలే, కులం - ధనం వంటి కవితా సంపుటాలు "గాథత' లోనం వల్ల పఠితను వెంటాడి వేటాడి వేధిస్తాయి. సామాజిక, చారిత్రక వాస్తవ నేపథ్యం పఠితను పీడిస్తూనే ఉంటుంది. రచయిత సజీవ శిల్పం పఠిత మేధను మధిస్తూనే ఉంటుంది.

తన ఆలోచనా సంచలన తరంగాలను అవలీలగా జన సముద్రంలోకి పంపించి ప్రజా సమూహపు ప్రతిస్పందనను పరిశీలించాడు రచయిత. ప్రశంసలు, పొగడ్తలు, తెగడ్తలు, విసురులు, చెణుకులు ఎడాపెడా శరపరంపరగా వచ్చిపడ్డాయి. "కాకి" కథలోని బీభత్సరసానికి భయపడిన సమాజం, "ఊరబావి"లో చిదంబరం భార్య శక్తియుక్తులకు తుళ్ళిపడిన సమాజం, "కులవృత్తి"లో కథేతివృత్తం చదివి ఉలికిపడిన సమాజం, "ఆకలి" కథలో చిన్ని, "పిండీకృతశాటి'లో చాకలి గూగడు, "పశ్చాద్భూమి"లో పాయిఖానాల పనివాడు రాంకోటి, "ట్రోఫీ"లో ఆరతి, వంటి పాత్రలు తమలో తాము సంఘర్షించు కుంటుంటే చూసి బెదిరింది సమాజం! ఈ పాత్రలు సమాజంతో సంఘర్షిస్తే తేరుకోలేనిది ఈ సమాజం ఇలా మనిషి మనోగత భావాలు, ఆశలు, ఉద్వేగాలూ, సుఖ సంతోషాల, రాగద్వేషాల నిచ్చెన మెట్ల మీద ఊగుతూ, సమాజాన్ని కుదిపి కదిపితే సమాజం సహజంగానే ఉలిక్కిపడింది. ఉక్కిరి బిక్కిరి అయ్యింది. తనలోని కీలకాంశాలను ఈ పాత్రలు పట్టి కదిలించేయడంతో శతాబ్దాలుగా పట్టుబిగించిన పురుషాధిక్యత, కులాధిక్యతల పునాదులు బీటలు వారతాయేమోనని బెదిరింది.

దళిత జీవుడి వేదనా తత్త్వం కేంద్ర బిందువుగా రచన సాగించిన ఆచార్య ఇనాక్ సాహిత్య ప్రక్రియలను ఒడుపుగా తన వశం చేసుకున్న కథకుడు. సమాజ గర్భంలో గుట్టుగా దాగిన మాలిన్యం, కల్మషం రచయిత రచనల తుఫాను తీవ్రతలో అతలాకుతలమై పోతుందన్న వెరపు ఈ సమాజానికి ఉంది. కథకులు వస్తూ ఉంటారు! పోతూ ఉంటారు. కథా సాహిత్యం, నవలా సాహిత్యం, కవిత్వం వంటి ప్రక్రియలు శాశ్వతం! ఈ ప్రక్రియల అభ్యున్నతికి ఆచార్య ఇనాక్ వంటి రచయితల అవసరం ఎంతో ఉంది. ఎందరో ఇనాక్‌లు ఆవిర్భవించవలసిన స్థితి ఉంది. ఒక్క ఇనాక్ వందల, వేల ఇనాక్‌లు కావాలి. భవిష్యత్తరాలకు ఎనలేని సాహితీ సంపదను అందించాలి. ఒక్కదీపం వందల వేల దీపాలకు ఆధారమైనట్టుగా ఒక్క ఇనాక్ ఎందరో యువకులకు యువతకు ఆయువు పట్టుకావాలి. అసామాన్యమైన, విస్తృతమైన సాహితీ సృజన చేసిన ఆచార్య ఇనాక్‌ను ఏ ఒక్క దృక్పథానికో, వాదానికో పరిమితం చేయవలసిన అవసరం లేదు. ఆ అవసరాన్ని దాటి ఆయన విశ్వమానవుడిగా ఎప్పుడో ఎదిగిపోయిన సందర్భం ఇది.

ఆచార్య ఇనాక్ చెప్పుకున్న మాటల్లోనే ఆయనను చూద్దాం. "ధనం లేక తిండిలేక నాడు పీడితుణ్ణి. చల్లగా పిలిస్తే పరవశించి వర్షించే నల్లమబ్బును. ఆదరిస్తే పులకాంకురాలతో మొలకెత్తే పంట భూమిని,..... నేను తప్పించుకుని పారిపోదామన్నా నా అంటరానితనం నన్నంటుకు వెంటాడుతూ ఉంది. నన్ను అరసం, విరసం, స్త్రీ వాద, దళితవాద, బహుజనవాద, మానవతావాద రచయిత అంటున్నారు.... నన్ను రచయిత అంటే చాలదూ? పేదరికం చాలా మందికి ఆస్తి. దళితులకు అంటరానితనం అదనపు సంపద. కులం వల్ల కుమలని, కులకని మనిషి లేదు. కులం ఒకడికి వరం. మరొకడికి శాపం. జనం వరాలు వదలరు. శాపాలు వదిలించుకోలేరు. కులం లేని భారతం పుదుతుందా? పెరుగుతుందా? బతుకుతుందా? బంగారం లాంటి కల, కల నిజమైతే ఎంత అద్భుత. కల కన్నీటికి తల్లి! నా కన్నీటి బొట్టు నా రచనలు" •



## ఒక స్మృతి ఎన్నో అపశ్రుతులు

- మహమ్మద్ ఖాన్

సూర్యుడు
కన్ను తెరచిన మరుక్షణమే
ఓ మబ్బు తునక ఆకాశాన్ని చుట్టుముట్టి
సూర్యుడ్ని తనలో ఇమిడ్చుకుంది

అనూహ్య రీతిలో
చెలరేగిన పెనుతుఫానుకు
మా ఇంటి ప్రధాన నెట్రాడు కూలి
కాల్గుంజల సపోర్ట్ లేక
మంచాన బిక్కు బిక్కుమంది
కళ్ళల్లో ప్రాణాన్ని నిలుపుకుని ఉన్న
పదమూడు రోజుల బాలింత అమ్మపై
ఆ పూరిల్లు హఠాత్తుగా కూలి పడింది

చెట్టు కూలిన
భయంకర శబ్దానికి పక్షులు చెల్లాచెదురై
నల్దిక్కులు పారిపోయి
చెదరిన గూట్లో రెక్కలు రాని పసికూనలు
హాహాకారాలలో తడిసి
నేల రాలిన వైనం, మా ఇంటి ఆనాటి కథ

రెక్కల్లో పిల్లల్ని దాచుకున్న
అనాథ పక్షుల్లా మా అమ్మ
మా బ్రతుకులకు నీడయి
నిచ్చెనయి పడవయి తీరాన్ని చేర్చింది
చేజారిన వసంతాన్ని,
ఆత్మవిశ్వాసంతో సాధించింది
మా అమ్మకు
కన్నీటి కాలువలే కాదు
ఉప్పొంగి పొరలే నదుల ప్రవాహాన్నయినా
ఎంతో ఓర్పు, ఆత్మ విశ్వాసంతో
అవలీలగా ఈదడం కూడా నేర్పింది, కాలం!
అవును!
ఆమె, జీవిత ప్రయాణాన్ని
ప్రారంభించింది వసంతమే, అయినా

జీవన యానం సాగింది వరదల్లోనే, నీటిపైనే
తెడ్డూ, తెరచాప లేక
కటిక దారిద్ర్యాన్ని ఎదుర్కొనే శక్తి చాలక
అలల సహాయముతో
ఒడ్డున చేరే కృషిలో తన సంసార
జీవన యాత్ర సాగిస్తూ అమ్మ
తుఫాన్‌లలోనే గడిపింది, కాలమంతా!

వాతావరణం, సద్దుమణిగిందెప్పుడు?
పర్యావరణం సహకరించి
ప్రకృతి చెయ్యందించినా
మా అందరి నుదుటి రాతలు అడుగడుగునా
ముళ్ళ కంపలయి, కాలానికి అడ్డుతగిలేవి
ఆ కాట్లన్నీ, అమ్మ ప్రత్యక్షంగా భరిస్తుంటే
పరోక్షంగా మేము, ఎదగాయాలతో
గూడు చెదరిన కూనలమయి తల్లడిల్లుతూ
దిక్కుతోచక, దిక్కు వెంట ప్రాణ భయంతో
అల్లల్లాడే వారం
నాటి గాయాలు,
నేటికీ స్మృతులయి వేధిస్తున్నా
అమ్మలేనితనాన్ని ఎవర్కి చెప్పుకోను!?
నా అక్షరాలకే కదా!

---



## చైతన్యపు సంద్రం

- తంగెళ్ళపల్లి కనకాచారి

ఎడారిలో
వసంతం తలుపు తట్టినట్లు
పారేసుకున్న ఆత్మను తాకినట్లు
పుస్తకం స్పర్శ
ఓ చైతన్యపు సంద్రం
దేహాన్ని ముంచినట్లు
బాల్య స్నేహితుడు నవ్వుతూ
పలుకరించినట్లు...

తొలిప్రేమలో గుండె
పులకించినట్లు
చెట్టున కాసిన ఫలం
కంప్యూటర్ యుగంలో సైతం
రుచిమారదు

జీవన వీణ పలికే సంగీతం
అంటే మధురం కదా!
ఎన్ని చెప్పు!
రాసుకున్న అక్షరాలకు
నగ్న సత్యాలకు నడుమ
మనం తీసే పరుగే జీవితం
పుస్తకం అధ్యయన మందిరం
పుస్తకం ఓ పవిత్ర క్షేత్రం....

---

## నా చెంత నువ్వుంటావ్ !

- ఎన్. నాగమణి



తడియారని కన్నీటి వరదలో
కొట్టుకొని పోతూ
తడిమి తడిమి చూసుకున్న
ప్రేమ బాసలకు బానిసనై
బాధ్యతా బంధాల్లో చిక్కి
విలవిలలాడుతూ
విగత జీవినైనప్పుడు
ఔనూ.....
అప్పుడే
కవిత్వమే నా కన్నీటికి
ఊరట ఊసులు చెప్పింది

భాషే నాతో జతకట్టి
నాలోని భావాలను ప్రజ్వలింపచేసింది

అక్షరాలే కరాలై
నా జీవితానికి ఊతమిచ్చి
నడిపించాయి
వస్తు సంస్కృతిలో నే కూరుకుపోకుండా
సాహిత్యం నా చెంతచేరి
చింతలెన్నో తీర్చింది
ఆర్థిక సంబంధాలలో
అసమాన సౌధాలు నిర్మింపబడినపుడు
మానవత్వ కుసుమాలే
నన్ను మహిలో మనిషిగా నిల్పినాయి
అప్పుడూ... ఇప్పుడూ.. ఎల్లప్పుడూ...

కథ

# పేగు పడగెత్తినట్టు

- డా॥ మానేపల్లి



**చదివాను. అంతే..**
**తెలియదు. ఎలా తెలుస్తుంది.**
**టీవీ ఛానళ్ల ప్రకటనల మధ్య తప్ప చూపించవు.**
**దినపత్రికలు ఒకోసారి ఫ్రంట్ పేజీల్లో రాస్తాయి.**
**లో.చూ.9పే. ఉంటాయి. అలా ఒకపత్రికలో చదివాను.**

ళ్ళంతా జ్వరం వచ్చినట్టయి పోయింది. ఒక నిరాశ పిడుగులా నెత్తిన పడింది. ఎక్కడో జరగలేదు. ఇరాక్‌లోనో, ఇరాన్‌లోనో, ఆఫ్ఘనిస్తాన్‌లోనో కాదు. చిలీ, లాటిన్‌మెర్కా దక్షిణాఫ్రికా..., పోనీ బీహార్‌లో గుజరాత్, జమ్మూ-కాశ్మీర్‌లో.. కాదు కానే కాదు.

ఇక్కడే జరిగింది.

మొన్న, ఇంకా ఆ మొన్న, ఈ మధ్య జరిగింది. రేపు జరగొచ్చు.

సినిమాలు ఆగలేదు. బంపర్ ఆఫర్లు ఆగలేదు. సీరియల్స్‌లో టెన్షన్...చూస్తూనే ఉండండి. అసెంబ్లీలో ఆగడాలు ఆగలేదు. మేధావుల ప్రవచనాలు ఆగలేదు. అతను చచ్చిపోయాడు, చంపేశారు. పత్రికల భాషలో "చంపబడ్డాడు". చంపేశారంటే అంతే కదా. ఈ "బడు" ఏమిటో. పేరు... సూర్యుడో చంద్రుడో గురవడో గుంపడో దుష్యంతుడో, రామయ్యో, కిష్టయ్యో కావచ్చు?

ఏ వూరు? ఏ జిల్లా? ఏం చేశాడు?

పుట్టలోంచి పాముల్లా ప్రశ్నలు పడగెత్తుతున్నాయి.

నిస్సందేహంగా ఎవర్నీ మోసం చేయలేదు.

చదవడం రాదు, వేలి ముద్ర తప్ప.

వయసు సీనియర్ సిటిజన్

బస్సులూ, రైళ్ళూ ఆగలేదు. హెలికాప్టర్లు ఎగరలేదు. చెవుల్లో హోరు. హోరు గాలిలో భజనలు ఆగలేదు. కరపత్రాలు దొరకలేదు. దొరకబడ్డాయి. చదివించుకోబడ్డాయి. అయినా వాడెవడో నవ్వుతున్నాడు. చదువుకున్న వాడిలా వున్నాడు. ఉద్యోగస్తుడిలా ఉన్నాడు. నవ్వు. వాడూ వాడూ వాడూ బహుశా అంతా ఒకటేనా! దొరికినవి కరపత్రాలు గాని కడప బాంబులు కాదు కదా.

బాంబులూ, తుపాకులూ ఫరవాలేదట. కరపత్రాలు మోస్ట్ డేంజరస్.

అన్నం పెట్టాడట. నిజమే. అరుగు మీద పడుకుంటానంటే సరేనన్నాడట. తెలియని మనిషికెందుకన్నం పెట్టాడు. షెల్టరిచ్చాడు. ఆకలంటే ఇంత అన్నం పెట్టాడు. రాత్రి కదా, పోనీ పడుకో అన్నాడు. ఎవరో తెలీని మనిషి. పాపం అనుకున్నాడు.

కాని - అదే పాపం అనుకోలేదు.

ఆ తరువాత - బస్సు దిగి - ఇంటికి నడుస్తున్నాడు పట్టపగలే.

గాంధీ పేరున్నవాళ్ళు, విగ్రహాలున్న వాళ్ళూ, అమ్మలూ, అయ్యలూ అందరూ చూస్తూనే ఉన్నారు. ఎండ –

ధన్ ధన్ ధన్... ఇంకోటి..

ఎన్ని ఒకటా, మూడా... పదే.. శానానట... కాదొకటేన్రా.

పోలీసులు కాదు, కాకీ డ్రస్సు లేదు. జులపాల జుట్టు. మెళ్ళో దేవుళ్ళా చెయిన్లు సెల్‌ఫోన్లు ఓవర్.. ఓవర్...

టాటా... ఛీరియో... ఒకే... ఓఖే...

రక్తపు మడుగు. జనం చెల్లాచెదురు. చెట్ల మీద పిట్టలు చెల్లా చెదర్లేదు. దూరంగా తప్ప అక్కడ చెట్లే లేవు. సిమెంట్ స్తంభాలు తప్ప.

క్రమంగా జనం కూడేరు. ఒరే మన ముసిలోడ్రా... ఎంత పనెంత పని, తిట్లు, శాపనార్థాలు, బూతులు. చేతుల మీద ఆస్పత్రికి.



అక్కడ నాటకం. హైటెక్ డ్రామా... ఎవరాడించారు. ఎందుకు అందరికీ తెలిసిందే. వాళ్ళిద్దరికీ, పోనీ ముగ్గురికీ తెలుసు. ఆ ముగ్గురూ అందరికీ తెలుసు. వాళ్ళకి పత్రికలున్నాయి. ఛానల్సున్నాయి. నినాదాల్లేవు. ఒకడుగు ముందుకెళ్ళారు.

వాడి ప్రాణం కాపాడబడింది. ఎవరిదీ. ముసిలోడిదా, డాక్టర్‌దా..

ఒకరీ సంగతి పేపర్లో రాశారు. ఒకట్రెండు పెద్ద పేపర్లూ రాశాయి.

చదివాను. కాఫీ కావాలి. ఇంట్లోంచి కాఫీ వచ్చింది. కాఫీ తాగి! అందరికీ చెప్పాలి. సరే చెప్పి? వాస్తవాలు చాటాలి? చాటి.. వాళ్ళ భాషలో 'ఏం పీకగలవు?"

నోట మాట రాలేదు. వస్తుంది. లోపల మేఘాలు సుడి తిరుగు తున్నాయి. చక్కని చిక్కని కాఫీ తాగేను కదా.

చావు చావును రక్షిస్తుంది. చావు దిశను నిర్దేశిస్తుంది. నిజం ముమ్మాటికీ నిజం. పేరు కోరదు. నడక కోరుకుంటుంది.

మానవజాతి ముందుకే నడుస్తుంది.

ప్రజలు ముందుకు నడుస్తారు.

ప్రజలు... ప్రజలు.. ప్రాచీన భాష చావదు. భాష కష్టజీవుల్ది. శరీర శ్రమలోంచి, ఆహారోత్పత్తిలోంచి భాష పుట్టింది.

నా భుజం మీద చెయ్యి పడింది. తల ఎత్తకుండానే చూశాను. లెమ్మన్నట్టు చూశాడు.

కూచుని కూచుని వున్నానేమో నరాల్లో సత్తువ కూడదీసుకుని లేచాను. సమ్మెట పడగెత్తినట్టు లేచాను. పత్తి గింజ పేలినట్టయింది.

పదమన్నట్టు చూశాడు.

కంటితో ఇంజక్షన్ చేసినట్టు చూశాడు.

మనోడే.

నేనింకేం మాట్లాడలేదు. మాట్లాడ్డం దేనికి? ■

# ఊసరవెల్లి

**- రావు**



అతని ఒయ్యారపుటడుగులు
రంగులు మార్చే సవ్వడిలేని అడుగులు
బడుగులమైన మా గూడేలను,
మా గుండెలను తాకి
దీనజనోద్ధరుడిలా కన్నుల విందు చేసి
మళ్ళొస్తానని ఓట్లన్నీ మూటగట్టుకెళ్ళాడు

ప్రతి పగలూ - ప్రతి రాత్రి
క్షణమొకయుగంలా గడిచాయి
కోటి కాంతులు కళ్లల్లో మెరిసాయి
వస్తాడేమో! ఇక వస్తాడేమో!
పాదాలు వీధి గుమ్మంలో
తోరణాలై నిలిచాయి
వీచిన వెర్రి గాలికి చెదిరిన ముగ్గుల్లా
ఆశలు ఆవిరై నిరీక్షణే మిగిలింది!

రోడ్లులేని ఊళ్ళు
త్రాగలేని నీళ్లు
వాడుతున్న పచ్చని పైర్లు
మాడుతున్న డొక్కలు
ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా
జీవచ్ఛవాలమైనాము
బడుగుల కష్టార్జితాన్ని,

మరుగుతున్న మా రక్తాన్ని ఏ.సి. గదిలో
చల్లని గాలిలా పీల్చుకుంటూ
మేడపైకి మేడను ఎక్కిస్తూ
తెగబలిసినోడవుతున్నాడు
వారసత్వ ఉద్ధరణకై కంకణం కడుతున్నాడు!

ఐనా -
ఓట్ల పండుగ మళ్లీ వొస్తుంది!
అతని ఒయ్యారపు అడుగులు
మళ్ళీ మనవైపే
మన ఓటు ఇప్పుడు బ్యాలెట్‌పై కాదు
మదమెక్కి వాడు పీల్చిన
బడుగుల రక్తాన్ని నేలపై చిందేలా....
వాడి గుండెపై గుద్దాలి!
అప్పుడైనా వ్యవస్థలో
ప్రక్షాళన జరుగుతుందేమో!

---

# నానీలు

**- మంత్రి కృష్ణమోహన్**



రాకెట్‌లా
దూసుకుపోతున్నాడు చూడు -
ఓటమి మంటల్ని
వెనక్కి తన్నేస్తూ

వ్యసనాలు ఏడు కాదు
ఎనిమిది!
'సెల్లు'ను కూడా
కలుపుకోండి

జ్ఞానమెప్పుడూ
పెళ్ళినడకనే సాగుతుంది
చీకటిదే
మారథాన్!

ఈ శిలలోంచి
పువ్వు పూసినప్పుడే
శిల్పి పెదవులపై
నవ్వు విరిసింది

కబుర్లూ కలం స్నేహాలూ
నాటి హనీ
ఛాటింగ్ ఛీటింగ్
నేటి కహానీ!

దుఃఖం ముంచుకొస్తే
పాము కుబుసాన్ని
విడిచినట్టు
ఓ వాక్యాన్ని వదిలేస్తా!

అందుకే
అవి బండరాళ్ళు
కూలి - బతుకుల మీదుగా
దొర్లిపోయాయి!

చెమట చుక్క కాదు
నీటి ముత్యం
భావనలోనే కదా
సౌందర్యం

---

# చిత్రకారుడు



**- లియోనిడ్ మార్త్యనోవ్**

**- తెలుగు అనువాదం : ముకుంద రామారావు**

చిత్రకారుడు
తన కూతుర్ని చిత్రించాడు
ఆమె వెన్నెల రాత్రిలా
కేన్వాసు నుండి వెళ్ళిపోయింది.

తన కొడుకుల్ని
చిత్రించాలనుకున్నాడు
వారు తోటలై బయటకొచ్చారు
ఆ తోటల్లో చకోరం

అతని మిత్రులంతా
కలిసి అరిచారు
మాకెవరికీ
నీ పంథా ఏమిటో
అర్థం కావడం లేదని

వారెవరూ తనని
గుర్తించలేకపోతున్నారని
తనని తానే చిత్రించుకున్నాడు

చీకటి నుండి
చిత్రం వెలుగులోకొచ్చింది
వాళ్ళంతా వెంటనే అరిచారు
అది మేమేనని

(రష్యన్ కవిత : 9 మే 1905 - 27 జూన్ 1980)

---

# అమ్మ

**- పెరుముల కైలాస్**



'అ' 'అమ్మ' అని అక్షరాభ్యాసం చేయించాడు గురువు
'అ' అని ఉచ్ఛరించినపుడు ఏదో అనుభూతి
అది అక్షరమే అయినా అనంత ప్రేమని అందించింది
పిల్లాడిని ఎత్తుకున్న బొమ్మలోని అమ్మే
కమ్మదనపు అనుభూతిని అందించలేకపోయింది.
బొమ్మలోని అమ్మను పోల్చుకోలేని
నా సంకుచితత్వానికి సిగ్గేసింది
అచ్చు గుద్దినట్టు మా అమ్మలా ఉండకపోయినా
ఆమె కూడా మా అమ్మలాంటిదే
అనుకోలేక పోయాను

తల్లిని మించింది
ఏముందీ ఈ లోకంలో?
అమ్మ పెంచంది
ఏముందీ దేహంలో?

త్యాగానికి, అనురాగానికీ మరో పేరు అమ్మ
హోదా, అవార్డులు అమ్మతో తులతూగగలవా?
నా ప్రాణపు నాణానికి బొమ్మవై నిలిచిన అమ్మవే
జీవితాన్ని తరచి నాకీ బ్రతుకునిచ్చిన జననీ
నమస్కరిస్తున్నాను జననీ...
అమ్మదనానికి చెమ్మగిల్లిన నయనాలతో.."

## రచయిత - రాజ్యం

# తిలక్ పలికించిన 'ఆర్తగీతం'

- రాచపాలెం చంద్రశేఖర్‌రెడ్డి


తిలక్

నా దేశాన్ని గూర్చి పాడలేను
నీ ఆదేశాన్ని మన్నించలేను
ఆ విపంచికకు శ్రుతికలుపలేను.....
నీ కొత్త సింగారమ్మువలదు
ఉదాత్తసురభిళాత్త శయ్యాసజ్జితమ్మువలదు
రసప్లావితమువలదు......
గతచారిత్రక యశఃకలాపమ్మువివరింపకు
బహుళవీరానేక గాథాసహస్రమ్మువినిపింపకు
ఇంకనన్ను విసిగింపకు

నేను నేను కన్నీరుగా కడిగిన గీతికను
సిగ్గుతో రెండుగా చీలిన వెదురుబొంగును...
ఈ రోజు నేను చూసిన దేమి?...
విధియిన్ని కత్తులను దూసినదేమి?

నేను చూశాను నిజంగా
నీరంధ్రవర్షాన వంతెన కింద
నిండు చూలాలు ప్రసవించి మూర్ఛిల్లిన దృశ్యాన్ని...

నేను చూశాను నిజంగా
మూర్తీభవత దైన్యాన్ని, హైన్యాన్ని...
ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి
ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి
ప్రబుద్ధ దేవుని జన్మభూమికి గర్వస్మృతి?

ఇంకనన్ను నిర్బంధించకు నేస్తం
ఈ రాత్రి నేను పాడలేను
ఈ కృత్రిమ వేషాన్ని అభినయింపలేను
మానవత లేని లోకాన్ని స్తుతింపలేను
మానవునిగా శిరసెత్తుకు తిరగలేను
ఈ నాగరితారణ్యవాసంభరించలేను...
ఒక్క నిరుపేదవున్నంతవరకు
ఒక్క మలినాశ్రుబిందువొరిగినంతవరకు
ఒక్క ప్రేగు ఆకలి కాలినంతవరకు...
నాకు శాంతి కలగదింక నేస్తం
నేను నిగర్వినైనాను
సిగ్గులేని ముఖాన్ని చూపించలేను...
ఈ ఆర్తి ఏసౌధాంతరాలకు పయనింపగలదు?
ఏ రాజకీయవేత్తగుండెలను స్పృశింపగలదు?

ఆర్తగీతం (1956)

బాలగంగాధర తిలక్ ఈ కవితను 1956లో రాశారు. దీనిని చదువుతుంటే 1938లోనే శ్రీశ్రీ 'దేశచరిత్రలు' కవితలో ఏ వెల్గులకీ ప్రస్థానం? అని ప్రశ్నించినది గుర్తుకు వస్తుంది. 1956లోనే గుర్రం జాషువా 'కొత్తలోకము' లో" ప్రభువు కలడని సంతృప్తి పడుట కాని సుకము కల్పించునన్న నమ్మకములేదు "అంటూ నిరాశపడటం గుర్తుకు వస్తుంది. కవులకు ఈ అనుమానాలెందుకు వచ్చాయి? వాళ్ళేమన్నా నిరాశజీవులా! కాదు వాళ్ళు స్వచ్ఛమైన ఆశాజీవులు అయితే స్వాతంత్ర్యానంతర రాజకీయ వ్యవస్థ, భారత జాతీయోద్యమం ప్రజలలో కలిగించిన ఆశలను అడియాశలుగా మార్చడమే ఈ కవుల అసంతృప్తికి కారణం.

తిలక్ మార్క్సిస్టు కవి కాదు. తనది ధనిక వాదమో సామ్యవాదమో కాదని చెప్పుకున్నాడు 1941లో అయితే తన "అక్షరాలు ప్రజాశక్తులావహించే విజయ ఐరావతాలు" అని భరోసా ఇచ్చారు. ఈ భరోసా నిచ్చింది అప్పటి అభ్యుదయ స్వాతంత్ర్యోద్యమమే.

ఈ కవితలో ధనిక సామ్యవాద నేపథ్యమే కీలకం.

1956 నాటికి భారతదేశానికి స్వతంత్రం వచ్చి ఒక దశాబ్ది నిండింది. సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. పంచవర్ష ప్రణాళికలు అమల్లోకి వచ్చాయి. రాజ్యాంగం రూపొందింది. బౌద్ధాన్ని స్వీకరించిన డా॥అంబేద్కర్ అణగారిన జాతుల నాయకుడుగా వెలుగొందుతున్నాడు.

తెలుగు రాష్ట్రంలో తెలంగాణ రైతాంగ సాయుధపోరాటం విరమింపబడింది. ఆంధ్ర రాష్ట్రమూ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమూ ఏర్పడ్డాయి. పెట్టుబడిదారీ శక్తులు వామపక్ష శక్తుల్ని నిర్వీర్యం చేయడంలో నిమగ్నమయ్యాయి. తెలంగాణా ప్రజలు తరిమి కొట్టిన భూస్వాముల, దేశముఖ్‌లు కొత్త అవతారంలో గ్రామాలకు తిరిగి వచ్చారు. దోపిడి యథాతథమైంది. ఆర్థిక అసమానతలు, సాంఘిక, జండర్‌వివక్షలు, ప్రాంతీయ అసమానతలు యథావిధిగా కొనసాగుతూనే ఉన్నాయి. తెలంగాణా, వజ్రాయుధం, త్వమేవాహమ్ వంటి కావ్యాలతో తెలుగు సాహిత్యం అభ్యుదయ పరుగులు తీస్తున్నది. ఈ నేపథ్యంలో తిలక్ కవిత వచ్చింది. సామ్యవాదిని, ధన సామ్యవాదిని కాదని చెప్పుకునే కవితో ఈ 'ఆర్తగీతం' రాయించింది. నాటి సామాజిక వాస్తవికతే "మన స్వతంత్రం ఒక మేడిపండు. మన దరిద్రం ఒక రాజపుండు అన్న ఆరుద్ర (1948) నిర్ధారణను ఈ 'ఆర్తగీతం' మరోసారి నిర్ధారించింది.

స్వతంత్రం పొందిన దేశాన్ని గురించి ఒక దేశభక్తుడైన, ఒక స్వాతంత్ర్య సమరయోధుని పేరు పెట్టుకున్న కవి" అ దేశాన్ని గురించి పాడలేను" అని అన్నాడంటే ఊరికే అంటాడా? రాజకీయ వ్యవస్థకు పెట్టవలసినంత గడుపు పెట్టి మరీ అన్నాడు. ఎందుకన్నాడంటే పాలనారూపం మారి సారం అలాగే ఉండిపోయింది కాబట్టి జాతీయోద్యమ కాలంలో "లేదురా ఇటువంటి భూదేవి యొందు" అని పాడుకున్నాం. కాని 1956 నాటి కవి " గతచారిత్రక యశఃకలాపమ్ము వివరింపను "అని హెచ్చరించాడు.

ఈ కవితలో కవి తన కాలంనాటికి ఉన్న యథార్థసామాజిక పరిస్థితిని చూశాడు. అది అప్పటి సామాజిక వాస్తవికత కవి గౌతమబుద్ధునిలాగా సమకాలీన సమాజ వాస్తవిక దృశ్యాలను చూశాడు. ఒక ముసలాయన ఆకలిని జయించలేక మర్రిచెట్టుకింద మరణించడం చూశారు. ఒక పేద చూలాలు వర్షంలో వంతెన కిందనే బిడ్డను ప్రసవించి మూర్ఛపోవడం చూశాడు. తల్లిదండ్రులు లేని మూడేళ్ళ పిల్లవాడు తిండి కోసం ఏడుస్తూ మురికి కాల్వ పక్కనే నిద్రించడం చూశారు. పిల్లలకు గంజి కాచిపోసి తాను పస్తులుంటూ కన్నీళ్ళతో మనసు కకావికలమైన ఆఫీసులో ముసలి ఫ్యూన్ వీరన్నను చూశాడు. అయిదారుగురు పిల్లలు గల గుమాస్తా క్షయ రోగి భార్య బతకదని డాక్టర్ చెప్పినప్పుడు విని పెద్ద గాలికి కదిమి చెట్టు చలించి పోయినట్లు, చలించి పోవటం చూశారు. రూపం దాల్చిన దైన్యాన్ని హైన్యాన్ని చూశారు. జీవచ్ఛవాలను చూశారు. కన్నీళ్ళ సముద్రాలను చూశారు. అన్నీ చూస్తే ఆయనకు కలిగిన ప్రశ్నలు ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి, ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి అన్నవి. అంతేకాదు. గౌతమబుద్ధునిలాగా ప్రపంచం అసలు రూపం తెలుసుకున్న కవికి" ఏ బుద్ధ దేవుడి జన్మభూమికి గర్వస్తుతి?" అన్న ప్రశ్న కూడా కలిగింది "సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి" అని నినదించిన భారతదేశం బుద్ధుని మార్గంలో పయనించిందా? లేదు మన మార్గంలో ప్రయాణించింది. ఫలితం" హిందూ దేశంలో మనుస్మృతి దెబ్బతగిలిన నాటి నుండి ప్రజా ఈ వరకును లేవలేక పడియున్నది."

(కట్టమంచి రామలింగారెడ్డి:కవిత్వతత్వవిచారము, 1914 పు 58)

కవి స్వార్థపరుడు గనక, కవిది ధర్మాగ్రహం గనక ఈ దుస్థితికి ఎవరు బాధ్యులో వాళ్లనే ప్రశ్నించాడు. ఈ ఆర్తి ఏ రాజకీయవేత్త గుండెలను స్పృశింపగలదు? ఏ భగవంతుని విచలింపజేయగలదు? అని. అంతేగాక ఈ అసమానతలున్నా భగవంతుని పేరు మీదనే అమలవుతుంటే ఈ ఆర్తి ఏ భగవంతునికి నివేదించుకొనగలరు? అని కూడా ప్రశ్నించాడు.

చివరికి కవి ఏమి కోరుకున్నాడు? సమాజం మారాలని కోరుకున్నాడు. ఒక్క నిరుపేదకూడా ఉండకూడదన్నాడు. ఒక్కడి కళ్ళలోంచికూడా కన్నీళ్ళు రాకూడదన్నాడు. ఎవ్వడి ప్రేగు ఆకలితో అలమటించకూడదన్నాడు. తల్లిపాలకోసం ఏ పిల్లలూ ఏడవని స్థితి రావాలన్నాడు. తల్లుల ఏడ్పులు లేని స్థితి రావాలన్నాడు. అప్పటిదాకా తనకు శాంతికలగదన్నాడు.

తిలక్ ఉన్న స్థితిని చెప్పాడు. దానికి కారణాలను చెప్పాడు. ఉండవలసిన స్థితిని చెప్పాడు. ఈ మూడంశాలూ చెప్పిన కవి నాలుగో అంశం చెప్పలేకపోయాడు. అవి తాను ఎత్తి చూపిన సమస్యలకు పరిష్కారమేమిటో చెప్పకపోవడం అవి ఎలా పరిష్కారమౌతాయో చెప్పలేకపోవడం. ఆకలి ఆర్త నాదాలు, పేదరికం, కన్నీళ్ళు, పాలకోసం పిల్లలఏడ్పు, పాలివ్వలేని తల్లులేడ్పులేని సమాజం కావాలన్న కవి ఆ సమాజం ఎలా ఏర్పడుతుందో చెప్పకపోవడం ఇది చెప్పాలంటే కవి మార్క్సిస్టు కావలసిందే. తిలక్ మార్క్సిస్టు కాదు గనక ఆయన కవితలో విమర్శనాత్మక వాస్తవికత మాత్రమే ప్రతిఫలించింది, సోషలిస్టువాసవికత ప్రతిఫలించ లేక పోయింది. సమాజ జీవితంలోని ఆర్థిక వైరుధ్యాలను గుర్తించడంలో ఆయన మీద మార్క్సిజం ప్రభావం చూపినా దాని నిర్మూలనం చెప్పలేక పోవడానికి కారణం ఆయన మార్క్సిజాన్ని ఆమోదించకపోవడమే. ఆర్థిక అసమానతలున్నంతకాలమూ ఎవరూ తమ దేశం గొప్పదేశమని, తమ సంఘం నాగరిక దేశమని చెప్పుకోవడానికి వీలుకాదని చెప్పారు కవి. ఆ అసమానతలను చూసి ఎవడైనా సిగ్గుతో తలదించుకోవాలని చెప్పాడు.

తిలక్ 'ఆర్తగీతం' వచ్చి అయిదున్నర దశాబ్దాలైంది. సమాజస్థితిలో ఏమైనా మార్పు వచ్చిందా? కాని రావలసినంత రాలేదు. కారణం రాజకీయ వ్యవస్థే. దోపిడి నిర్మూలన అజెండాలో లేని ఏ రాజకీయ వ్యవస్థ అయినా ఉన్న వారి కొమ్ముకాయడమే దాని కర్తవ్యం. గత అయిదున్నర దశాబ్దాలలో గరీబీహఠావో నినాదాలు మారుమ్రోగాయి. శ్వేత విప్లవాలు, హరిత విప్లవాలు వచ్చాయి. స్వర్ణ భారత్ వెలిగిపోయింది. జిఎడి పైకెక్కుతున్నది. అగ్రరాజ్యంగా అయిపోతుందని ఒకటే ప్రచారం. అయినా నిరుపేదలు ఉంటూనే ఉన్నారు. మలినాశ్రువులు ఒరుగుతూనే ఉన్నాయి. ఆకలి పేగులు తంబూరాలు మ్రోగుతూనే ఉన్నాయి. పుట్టిన బిడ్డలు చెత్తకుప్పల్లోనో, మురికి కాల్వల్లోనో తేలుతున్నారు. అనాథశవాలుగా అనాథశ్రమాలు, వృద్ధాశ్రమాలు పెరగడమే తిలక్ నాటి పరిస్థితులు ఇంకా కొనసాగుతున్నాయనడానికి నిదర్శనం. మన దేశంలో మరో స్వాతంత్ర్యోద్యమం అవసరమనే స్థితిలో మనముంటున్నాం.

అందువల్ల తిలక్ 'ఆర్తగీతం' నేటికీ సజీవ సంబంధం కలిగింది. ఇవాళైతే ఈ కవితలోకి రైతులు, రైతు కూలీలు, దళిత బహుజనులు, మహిళలు, మైనారిటీలు వచ్చి చేరేవారు. రచయితకు ప్రజాస్వభావముంటే రాజ్యాన్ని తిలక్‌లాగే ప్రశ్నిస్తారు ఎవరైనా.

# నిశ్శబ్ద గీతం

- కెంగార మోహన్



కాలం లోతుల్లో కెళ్ళి
హృదయాన్ని మథించాలని ఉంది.
వెళ్తున్న ప్రతీసారి
జ్ఞాపకాలు వొద్దని వారిస్తున్నాయి.
ఒంటరిగా లేవని
లోపలి మనిషి అదుపులో ఉన్నావని
అంతరాత్మ ఘోషిస్తూనే ఉంది
ఆలోచనలు భావాల ప్రతిరూపపై
మనోఫలకపై రేఖాచిత్రాలను,
గీస్తున్నాయి.
మాయా ప్రపంచపు, నీడల్ని
జీవన దృశ్యంగా సప్త వర్ణాలతో
చిత్రించాలని ఉంది.

అప్రయత్నంగా గ్లోబల్ దృశ్యం
మెదడు పొరల్ని కప్పేసింది
వైరుధ్యం ఇద్దర్ని విభజించి
అంతర్ముఖీయ రేఖ గీసింది
అనుభవాల పుటలన్ని
వొక్కొక్కటిగా అదృశ్యమయ్యాయి

అంతర్లీనంగా దాగిన మనిషి
బయటికొచ్చి మార్కెట్ ప్రపంచాన్ని
చూడాలనుకుంటున్నాడు
లోపలి నాది కోరికను
బయటివోడు స్వాగతిస్తున్నాడు
మదిని విచ్ఛిన్నం చేసి
మౌనంగా విలువల్ని వేలానికుంచాడు
అమ్ముకునేందుకు కొనేందుకు
ఏ డిమాండు థియరీ,
ఎటువంటి సప్లయ్ సూత్రమక్కర్లేదు
ఏ ఇతర క్షీణోపాంత సమోపాంత
ప్రయోజన సూత్రాలక్కర్లేదు
మనుషుల ప్రాణముంటే చాలు
జీవితాలతో, జీవనాలతో,
చెలగాటమాడి నిశ్శబ్దగీత మాలపిస్తున్నాడు.

# తోడు

- ఎల్.ఆర్. స్వామి



మల్లెల మబ్బులతో దోబూచులాడి
అనంత వాయువులో, వాయువుగా తేలియాడి
విహరించిన నన్ను
ఈ నేలకి లాగిందెవ్వరు?
ఈ ఊబిలోకి తోసిందెవ్వరు?
నా విమానం నేలని తాకగానే
నా కోసం కాపలా
దారి పొడుగున మార్గనిర్దేశకులు,
భుజంమీద కండువా
ఒకటా రెండా .....ఎన్నెన్నో
కుల మత నామధేయపు కండువాలు!
బయట రోడ్డుకి ఇరువైపుల కంచె
కళ్ళకు గంతలు
అటూ ఇటూ చూడనివ్వని ప్రయాణం

ఇక నేను భరించలేను
ఈ గంతలు తీసేయండి
కంచెలు తీసెయండి
నా కండువాలు తీసేయండి
నాకు లోకం చూడాలని ఉంది

బీడు భూమిలకు వానచినుకునై
శిశిర కాల లతలకు వసంతమై
ఆషాడమాసపు కరిమబ్బులకు
దరహాస చంద్రికనై
సాగిపోవాలని ఉంది.
చివరికి అలసిసొలసి అడుగులు తడబడి
భూమిలో పడి నిదురించే వేళ,
నాకు తెలుసు
కాపలా ఉండదు కండువాలు ఉండవు
మార్గనిర్దేశకులూ ఉండరు
నా పక్కనే నాకు తోడై
నాతో పడివుండేది
నాలాంటి మనిషి మాత్రమే

# సాగనంపారు

హిందీ మూలం : షబ్బీర్ హసన్ (బీహార్)

అనువాదం : డా.వెన్నా వల్లభరావు



షబ్బీర్ హసన్!
నువ్వు వెళ్లలేదు
నీ స్నేహితుని పెళ్లికి.
బహుశా నీకు తెలిసుంటుంది
ఆ ఊళ్ళో
కేవలం రెండు కుటుంబాలే
మహమ్మదీయులవని.
నీ మనసులో ఉండి ఉంటుంది.
గోద్రా, అహమ్మదాబాద్
సంఘటనల భయం!
కానీ షబ్బీర్ హసన్!
తర్వాత నీకు కబురందే ఉంటుంది.
పెళ్ళిలో
ఇరుగు-పొరుగు హిందువులే
పెళ్లికెళ్లినవారికి భోజనాలు వడ్డించారని

ఎంగిలి పాత్రలు సైతం వాళ్ళే కడిగారని
ఎంతో ఆప్యాయంగా మర్యాదలు చేశారని
తిరిగొచ్చేటప్పుడు పెళ్లివారిని
ఊరు పొలిమేరల వరకు
వాళ్ళు సాగనంపారని...

షబ్బీర్ హసన్!
నీకు తెలియదా-
హిందూస్తానంతా
అహమ్మదాబాద్ కాదని!

# మహోన్నత కవి

- సోమయాజుల సుబ్రహ్మణ్యశర్మ



సాహితీ సామ్రాట్టు
మరో ప్రపంచ కవిత్వాని
కాతడే పైమెట్టు
చలన చిత్ర గీతాల
మార్బిస్ట్
అభ్యుదయానికి ఎవరెస్ట్
అక్షర లక్షల కోట్ల క్యాపిటలిస్ట్
శాశ్వత పద ప్రయోగాల సైంటిస్ట్
కవన వనమున చవులూర్చు తేనెపట్టు
కలము శ్రీశ్రీగా మారిన
భాషల బాసల ఆయువుపట్టు

కథ

# పంచాది



- సగ్గు రాజయ్య

**ఆరోజు ఆదివారం! భాగ్యనగర ఉద్యోగ జీవులంతా వారంలో దొరికిన ఒక ఆదివారాన్ని ఉల్లాసంగా గడుపుకోవాలనుకుంటారు పిల్లాపాపల్తో ఇష్టమైంది వండుకుని తిని, జలసాగ గడుపుతారు. అలాంటి వాళ్లే కాకుండా సమస్యలతో సతమతమయ్యే వాళ్లు కూడా ఉంటారు.**

సిటీలో సుమారుగా ప్రతి బస్తీకి ఒక కమ్యూనిటీహాలో, సమాజమో, సంఘమో ఉంటుంది. వాళ్ల పరిధిలోని కుటుంబాల బాగోగులు, సమస్యలు చూడడానికి, ఆ బస్తి ప్రజలచేత ఎన్నుకోబడిన కమిటీ కూడా ఉంటుంది. వాళ్లూ ఉద్యోగస్తులే. బైలాస్ ప్రకారంగా రెండు సంవత్సరాలకొకసారి ఎన్నికలు జరుగుతుంటాయి. ఆదివారం రాగానే తమ స్వంతపనులు మానుకుని సమాజసేవపై దృష్టి పెడతారు.

ఈ ఆదివారం సూర్యనారాయణ, ఆయన భార్య మంజులది. సమాజంలో పంచాది. వాళ్లకు పెళ్లయి రెండు సంవత్సరాలయింది. తనను ఇడిసి పెట్టి పోతనంటున్నదని కాగితం రాసి పంచులకు (పంచాది పెద్దలకు) ఇచ్చాడు.

ఉదయం పదకొండుగంటలయ్యింది. సమాజంలో పంచులంతా కొలువుతీరినారు. సూర్యనారాయణ, మంజుల కేసు డిస్కషన్‌కు వచ్చింది.

"నువ్వేం మాట్లాడతావ్ సెకరెటరీ, ఆ పిల్లకు ఇష్టం లేదా?" ప్రెసిడెంట్ అన్నాడు.

"ఔను ప్రెసిడెంట్ సాబ్, ఆ పిల్లకు, పిల్లగానితోటి సంసారం చేసేది ఇష్టంలేదు".

"నలుగురు కల్సి ఒక సంసారాన్ని నిలబెడతారు. సంసారమంటే ఏందనుకున్న సెకరెటరీ, ఒక గుడి! ఆ గుడి నెప్పుడు కూలగొట్టద్దు. నిలబెట్టాలి!!"

" ఆ సంగతి అందరికి ఎరుకేగని, ఆ పిల్లకు ఇష్టం లేదంటే ఏ కోర్టు ఏం చెయ్యలేదు. మనమూ ఏమి చెయ్యలేము."

అన్నాడు సెకరెటరీ.

"ఇదేం మాట సెకటరీ, రెండేండ్లు కాపురం చేసినంక ఇప్పుడిష్టం లేదంటే ఎట్లయ్యా?"

"ఔనుసారూ, ఇప్పుడే మొగడంటే ఇష్టం లేదంటుందట. మరిప్పుడేం చేద్దాం"

"ఆమెకు మొగనితోటి ఏం కష్టముందో తెల్సుకోవాలె"

"అట్లాడిగినా ఏమి చెప్పుతలేదంట"

"ఆమెను చిన్నంగ బుదగరియ్యాలె"

"అది మనతో కాని పని"

"అదంత కాదుగాని, మొగన్ని అడిగినారా సార్, భార్య నిన్ను ఎందుకు వద్దంటున్నదని?" సెకరెటరీ ఉత్సాహంగా అడిగిండు.

"మొగున్ని కూడా అడిగినసారూ! ఆయన భార్యను బాగనే సూసుకుంటున్నడట. ఎందుకు ఒద్దంటున్నదో తెల్వదంటున్నడు"

"వీని మీద మనసు ఇరిగి ఇంకెవనన్న మరిగిందేమో!"

"ఛీ ఛీ.... అసొంటి మాటలు మాట్లాడొద్దయ్యా, మనకూ ఆడపిల్లలున్నరుగద, మనవీపు మనకు కనబడదు" అన్నాడు ప్రెసిడెంటు.

"మరింకేందయ్యా, అసలు వాని ఊర్లెపటేలున్నడా లేదా?"

కోపంగా అడిగిండు ప్రెసిడెంటును.

"ఇగో, ఇసొంటి పనికి రాని మాటలు మాట్లాడొద్దు. అదే పరిస్థితి ఉంటే రెండేండ్లు ఎందుకు నోర్మూస్కోని ఉంటుంది మంజుల. ఇప్పుడు పటేలు లేడనే, కృశ్శనే పుట్టొద్దు"

"అసొంటప్పుడు మనమెందుకు తలకాయలు పగుల గొట్టుకోవాల సెకరెటరీసాబ్! ఆలుమగలను సమాజానికి పిలిచి అడిగితే ఖులం, ఖుల్లా తేలిపోతది" అన్నాడు వైస్ ప్రెసిడెంటు.

"ఇగ ఇప్పుడు చేసేది అదే!" అన్నాడు ప్రెసిడెంట్.

"అట్లయితే ఇప్పుడే ఫో మొగులన్నా! నీవు ఆర్గనైజింగ్ సెకరెటరీవికదా, వాళ్ళిద్దర్ని పంచులు పిలుస్తున్నారని తొందరగా రమ్మను, ఫో" అన్నాడు ప్రెసిడెంటు.

మొగులయ్యకు సర్రున బి.పి పెరిగింది.

"ఆc.. పో సార్... పో... నాకిదే పనా? నేను ఒద్దంటూంటే ఆర్గనైజింగ్ సెకరెటరీని చేసింర్రు. పంచాది అయినప్పుడల్లా ఇంటింటికి తిరిగి మనుష్యులను తీసుకురావాల్నా, హఖికత్ (వాస్తవానికి) ఎవరూ రారు సమాజం అంటే!"

"మొగులయ్యా, అందరు ఎప్పుడో ఒకప్పుడు మన చేతులకు ఒచ్చేటోల్లే. తప్పులదొరికినప్పుడు కత్తెరలపోకచెక్కను ఒత్తినట్లు ఒత్తితే రోగం కుదురుతది" అన్నాడు సెకరెటరీ.

"ఇగో, సెకరెటరీ, గిసొంటి మాటలే తప్పుడు మాటలంటారు. పంచాది మెంబర్లంటే అందరికి గౌరవం ఉండాలే. మనం వస్తుంటే, పోతుంటే లేచి నిలబడి నమస్తే చెయ్యాలే" అన్నాడు ప్రెసిడెంటు.

"తండ్రిని తండ్రననోడు, చిన్నాయనను తండ్రీ అని పిలుస్తాడా సార్, ఇవ్వన్ని మాటలు పిచ్చిమాటలుగాని... ఆ రోజులెప్పుడో పోయినయి ఇగ మర్యాద మాటకొస్తే ఇచ్చెటోడు ఎట్లన్న ఇస్తడు."

"అరె మొగులయ్యా! మన బాడి (కమిటి) ఎలక్షయి ఎన్ని రోజులైందిరా? రెండు నెలలే కదా... ఒక పంచాది కన్నా తీర్పియ్యకపోతిమి" అన్నాడు వైస్ ప్రెసిడెంట్.

"ఇది మొదటి పంచాదే కదా సెకరెటరీ"

ప్రెసిడెంట్ అడిగాడు

"ఔను... ఔను సార్"

"పోరా... ఆర్గనైజింగ్ సెకరెటరీ! తొందరగ ఆలుమొగలను పిలుచుకుని రారా! ఇది అయిపోతే నాకు ఇంకో పూలు పండ్లు కార్యక్రమం ఉంది" అన్నాడు ప్రెసిడెంట్ బాధగా.



"ఇదేంది సారో... అందరు పొమ్మనెటోల్లే, నాకే మన్నా జీతమిస్తున్నారా మీరు? నాది హానరరీజాబు! ఇష్టముంటే చేస్త, కష్టమనిపిస్తే చెయ్య, నీకు ఆర్గనైజింగ్ సెకరెటరీ ఇస్తున్నామంటే ఎలక్షన్‌నాడే ఒద్దన్నా. బలవంతంగా తగలకట్టింర్రు థాంక్‌లెస్ జాబ్‌ను. అసహనంగా అన్నాడు మొగులయ్య

"సూరిగాడు నా భార్య నన్ను ఇడిసిపెట్టి ఎల్లిపోతదంటుని పంచులకు లెటరు ఇచ్చిండు అదేందో తప్ప(తీర్పు) చెయ్యాలె.

అందుకే వాళ్ళిద్దర్నీ సమాజానికి తీసికురారా, వానిదేం తప్పు, ఆమెదేంతప్పు ఉన్నదో ఇద్దరి బయాన (స్టేట్‌మెంట్లు) విని తెల్సుకోవాలే. ప్లీజ్ పోరా మొగులయ్యా: నువ్వయితేనే ఈ పని నడుస్తది" అన్నాడు ప్రెసిడెంట్. బ్రతిమాలుతున్నట్లుగా.

"సరే... ఇంక నాకు తప్పేటట్టులేదు. పిలుచుకుని వస్తానుండు" అనుకుంట జల్ది సూర్యనారాయణ ఇంటికి పోయిండు.

"సూర్నారీ! మీ భార్య ఎల్లిపోతదంటని పంచులకు లెటరు ఇస్తివి. నిన్ను నీ భార్యను సమాజానికి తీసుకుని రమ్మన్నడు ప్రెసిడెంట్ సాబ్" చెప్పిండు మొగులయ్య.

"సమాజంలో ఎవరెవరున్నారయ్యా" సూరి అడిగిండు

"ప్రెసిడెంట్, వైస్‌ప్రెసిడెంట్, సెకరెటరీ, ఆర్గనైజింగ్ సెకరెటరీ ఇంకా మెంబర్లున్నారు. తొందరగా రామ్మా" అన్నాడు మంజులవైపు చూస్తూ మళ్ళీ ఆయనే, మీరు తొందరగ వస్తే తప్ప అంత తొంతరగ అయిపోతుంది"

"నేను ఎల్లిపోతనని మీకు లెటరెవరిచ్చింర్రయ్యా" మంజుల అడిగింది.

"సూర్నారి లెటరు ఇచ్చిండమ్మా. ఆ సంగతే పంచులు మాట్లాడుతామంటున్నారు."

"ఆయనకు పనిపాటేమీలేదు. ఇంటి సంసారాన్ని బజార్లేస్తనంటడు"

"ఆయన రాస్తేనేగదమా!, పంచులు సమాజంల మాట్లాడతమని కూచున్నారు"

"మళ్ళ ఇంకోసారి చెపుతున్నగద, పనిపాటేమీ లేక, తిన్నదరగక మీకు లెటరు ఇచ్చిండు పంచాది పెట్టమని" కోపంగా భర్తవైపు చూస్తూ అన్నది.

"ఔనే... మాటమాటకు ఎల్లిపోతనని గడబిడచేస్తున్నవు గద నాకు తిన్నది పైకి (శరీరానికి) పడుతలేదు. నాకు శాంతి లేకుంట పోయింది."

"మనం ఇంట్ల మాట్లాడుకుంటే శాంతి దొరకదా? సమాజానికి ఎక్కి నలుగురి ముందు మన ఇద్దరి సంగతులు బయటపెట్టుకుంటేనే బాగుంటాది? నలుగురు విని, మనం ఇవతలికి రాంగానే నవ్వుతరు. భలే తెలివిమంతునివయ్యా".

"ఎల్లిపోతనంటావ్, నాసంగతేందో తేటతెల్లగ చేసిపోవాలె"

"తెల్లంగ మల్లెపూవులెక్క చేస్తసూడు నీ సంగతి!"

"మీరు ఇక్కడనే కొట్టాడుకుంట ఉంటరా, సమాజానికి వస్తే అంత బరాబరి (తేటతెల్లంగ) చేస్తరు కదమ్మా, మరిమీరు ఒస్తరా, రారా!"

విసుగ్గా అడిగిండు మొగులయ్య

"మొగులయ్య సారూ, ఆమె తర్వాత ఒస్తదిగని, మనం పోదాం నడు"

ఇద్దరు కల్సి సమాజానికి చేరుకున్నారు.

... ... ...

గంటయ్యింది. మంజుల వస్తుందేమో అని అందరు ఎదిరి చూస్తున్నారు కోర్టు ఫైనల్ హియరింగ్‌కు జనం విరగబడినట్లు, సమాజంలో నిండా జనం మూగిండ్రు.

ఏం జరుగుతుంది? మంజుల సూరిని ఎందుకు వద్దంటున్నది? అసలు వాళ్ళిద్దరి మధ్య గొడవేంటి? దానిని పంచులు ఎట్లా సాల్వు చేస్తారు? పెళ్ళాం మొగుడు వాదన ఎట్లా ఉంటది? అక్కడ ఉన్నవాళ్ల మనస్సులో ఉత్కంఠ గొలుపుతున్న ప్రశ్నలు!



ఊతకట్టె పట్టుకుని, గూనినడుముతో నడవలేక నడుస్తూ, సమాజాకి వచ్చింది మైసమ్మ. వయస్సు తొంబయి దాటి ఉండవచ్చు.

"ఇయ్యాల ఎవరి పంచాదిరా? అందరు వచ్చిండ్రు" అడిగింది అవ్వ

"నీయమ్మ నీకెందుకే? నడవసాతగాదుగాని, అన్ని సంగతులుగావాలె నీకు" విసుక్కున్నాడు మొగులయ్య.

"నాకు సాతగాక పోతె నన్నెత్తు కుంటున్నావురా మొగులా?" తీక్షణంగా కోపంతో అన్నది అవ్వ.

"ఓ తల్లీ, మేమంత టెన్షన్‌లో ఉన్నాము పంచాది ఇంక మొదలు కాలేదు. అయ్యి, తొందరగా ముగుస్తుందనుకుంటే, ఎటుగాకుంట అయితున్నది" ప్రెసిడెంట్ అన్నాడు విచారంగా.

"అరె, పంచాది ఎవ్వరిదిరా అంటే చెప్పకుంట దాసుకుంటరేందిరా?"

ముసల్దానికి వివరాలు చెప్పకపోతే విడువదని, అందర్ని వరసపెట్టి తిడుతుందని, మొగులయ్య అందుకున్నాడు.

"మంజుల సూరిగాణ్ణి ఒద్దంటున్నదట ఇడిసిపెడ్తదట. ఆ సంగతి గురించే పంచాది పెట్టిండ్రవ్వా"

"మీరేమి మాట్లాడుతారురా? వెనకటికి రాజులకు ఇసొంటి పంచాది వస్తే వేగులను (వేగులు, సిఐడి) పెట్టి తెల్సుకునేటోళ్ళంట. మీరు గద్దెలమీదకూసుండి పంచాదులు తెంపుతమంటే నిజం ఎట్ల బయటికి వస్తదిరా"

"నీకు తెలిసిన నిజాలేమిటో చెప్పవ్వా!" అన్నాడు తెల్సుకోవాలని తలంపుతోటి సెకరెటరీ.

"ఆ మంజుల బాధలు మీకేమి తెలుస్తయిరా.. తన మొగుడు ఇంకో ఆడదానితో తిరుగుతుంటే, ఏ ఆడదైనా ఒద్దనక ఏం చేస్తదిరా? ఆడది అట్లనే తిరిగితే మొగోళ్ళు ఊకుంటార్రా?"

అందరు నోళ్లు ఎళ్లబెట్టి చెవులురిక్కించి ఇంటున్నరు.

"సూర్యనారాయణ ఏ ఆడదానితో తిరుగుతున్నడవ్వా" అడిగిండు ప్రెసిడెంట్ క్యూరియాసిటీతో.

"ఇంకే ఆడదిరా మీరు బస్తీలో ఉండి కండ్లు మూసుకున్నార్రా, ఈ మొగులయ్య పెద్ద బిడ్డతోటి! ఇడిసి తినరు మర్చిపండరు అన్నట్లున్నది వాళ్ళ సంగతి! సూరిగాని సైకిల్‌మోటరు రొడ్డెక్కితే సాలు, పృథ్వీరాజు సంయుక్తను ఎత్తుకపోయినట్లుగ కౌగలించుకుని రయ్యినపోతరు"

"ఏయ్ ముసల్దానా! నీవు బట్ట కాల్చి నా బిడ్డ మీదెయ్యకు! ఉడుకు నీళ్ళు పోసి ఇండ్లు కాలబెట్టొద్దు, ఆమె ఎవరు అనుకున్నావ్ లెక్చరర్! ఆమె మీద అట్లా చెప్పొద్దు. ఆమె తెలివి మీద నువ్వెంత?

"ఎందుకు చెప్పొద్దురా, అది సదువుకుంటే మొగులు మీద నుండి ఊడిపడ్డదా, దాని తెలివిసాటి ఆడదాన్ని ఏడిపిచ్చే తెలివేనా. అయిదుగురు ఆడపిల్లలకంటివి ఒకదానికి కూడా పెండ్లి చేయకపోతివి. సదువులు సదివి కొలువులు చేస్తే మొగడు వొద్దారా? సూరిగానికి పెండ్లయిన సంగతి నీ బిడ్డకు తెలువదా? ఎందుకు తిరుగుతది వాని ఎంబడి?"

"ఎందుకు తెల్వదు తెల్సు" అన్నాడు సెకరెటరీ.

"మరి పెండ్లమున్నోని తోటి ఆటలాడితే, వాని పెండ్లము ఇడిసి పెడుత అనకపోతే ఏమంటదిర? మంజులదేమన్న తప్పున్నదా పంచులు మీరే నాయం చెప్పండ్రి."

"ఇదంత నీకెట్ల తెలుసవ్వా? సెకరెటరీ అడిగిండు.

"పిల్లికండ్లు మూసుకొని పాలు తాగుకుంట లోకం సూడలేదనుకుంటదట నా భార్య ఇంట్లనే ఉంటది. దానికేమెరుక అనుకుంటడు సూర్యనారాయణ మంజులకు ఎరుకైన సంగతులన్నీ నాతోటి చెప్పుకుంట ఏడుస్తది"

మంజుల దీనగాథ చెప్పింది ముసలమ్మ

"ఏడి సూరిగాడు?... పట్టుకోండ్రి... తన్నుండ్రి... భార్యకిట్ల ద్రోహం చేసికుంట సమాజానికి ఎర్రి పిల్లగానిలెక్క లెటరు ఇస్తాడు?

పంచాది పెటుండ్రి నాభార్య ఎల్లిపోతంటున్నదని.... ఇట్లమందిని పరేషాన్ జేసుడేంది? ఇసొంటోల్లను ఇడువొద్దు. మనం లెటరు రాసి పోలీస్ స్టేషనుకు పంపిస్తాము..." అన్నారు తలొకమాట. సూర్యనారాయణ సంగతి వినంగనే సమాజంలో ఉన్న వాళ్లందరికి ఆశ్చర్యం, కోపం కలిగాయి.

"ఇప్పటిదాకా సూర్యనారాయణ ఇక్కడనే ఉండె ఏడీ... కనబడదేంది?" అన్నాడు ప్రెసిడెంటు.

"ముసల్ది మాట్లాడుతుండగ సల్లగ జారుకున్నడు" అన్నాడు సెకరెటరీ.

"ఇగ పంచాది ఎవరికి చెబుతము?

ముసలమ్మ కుండ పగలగొట్టినట్లు చెప్పింది"

# అవ్వ అంతరంగం

- మామిండ్ల రమేష్ రాజా



రేషన్ బియ్యం వచ్చినయి
ఇంట్లో ఎకాన లేదు
ఈ మద్యల కూల్లు దొరకలే
బక్కచిక్కిన పానమయ్యింది
వొంట్లో జవలేదు
బియ్యం పోతే మల్లొత్తయా
పూట గడిస్తే లేవ్వని యెల్లగొడ్తారు
ఎక్కువ పైసలకు అమ్ముకుంటారు
సావుకారు తాన
కొనే సత్తువ లేకపాయె
గరీబొల్లు ఎట్లా బతకాలి బిడ్డా
నిరుడు ఐదు గుంటల
వరి పెట్టిన
మాయదారి రోగమొచ్చి
బత్తెడు గింజలొచ్చినయి
పెట్టుబడెల్ల లేదు
రేపు ఎట్లా

కొడుకులు సూడాల్లంటరు
కోడళ్ళు సూత్తరా
యింతా బువ్వ పెెడ్తరా
కొడుకొచ్చి అవ్వ తిన్నవనే అడుగుతడు
తిన్లేదని ఎట్లా సెప్పనో
కొడుక్కి కోడలుకి
లడాయి పెట్టియ్యనా
వాళ్ళు... మంచిగుంటనే
నా పానం సల్లగుంటది
మట్టి కొట్టి మట్టి తిన్నా

పిల్లల సాదుకున్నా
నా కష్టం బిడ్డలకి రావొద్దని
నలుగిట్లో మంచిగా బతకాలని
ఆశపడ్డానురా
అదొక్కటే ఆరాటం
మీ కష్టం మీరు జెస్కోండి
ఒకడ్ని ముంచకుండా బతకండి
ఓ గడియల
నిజాయితీ నిప్పులపాలు జేసింది
అబద్దాలకి పెద్ద కొడుకులు ఆగం కాలే...
సత్యహరిశ్చంద్రులయ్యారు
మనమింకా
మాసిన బతుకులమయ్యాం
మతిలేని బతుకులు కావు
గతిలేని బతుకులు
నీతిమాలిన పనులు చెయ్యాలే
సావన్న రాకపాయె
ఇంకా బతికేం లాభం

---

# నీ ప్రియ నేస్తం

- తంగిరాల చక్రవర్తి



ఆదిమ సమాజం నుండి
ఆన్‌లైన్ దాకా ధరిత్రి చరిత్రకు సాక్షిని నేను
ఆటవిక తెగ నుండి
అణు రహస్యాల విస్ఫోటనాన్ని!
శిలాయుగాన్ని, సామ్రాజ్యవాదాన్ని
సజీవ స్మృతిగా-నవీన కృతిగా నీకందించే నీ నేస్తాన్ని నేను!!
యుగాల అగాధాన్ని!
వంతెనలా కలిపే విజ్ఞాన వీచికను నేను!!
నిశీధి జగతిని-నిఖిల జగావళిని!
నాలో నిరంతరం నిక్షిప్తం చేసుకొన్నదాన్ని-నేను...
బానిస తెగల విముక్త చైతన్యం నుండి
రాజుల-రమణుల ప్రేమ రసరాజ్యాన్ని...
సజీవ కావ్యంలా.... నీ కందించే నీ నేస్తాన్ని నేను...
అర్ధరాత్రమున అరుణమయిని నేను-
అమ్మనుండి ఆదికావ్యం దాకా
నా కరస్పర్శలో కదిలిన నీ వేళ్ళు
తప్పటడుగుల్ని తప్పటడుగులు కానీయని
జ్ఞాన-విజ్ఞాన-బాలశిక్షతో గమ్యం చూపినదాన్ని-
రా నేస్తం... రా నేస్తం! జీవితాంతం నీ తోడు-నీడ-నేనే నేస్తం!
నీ మస్తకంలో నిత్యం కొలువుండే నీ 'పుస్తకాన్ని' నేను...
రా నేస్తం... రా నేస్తం...
జీవితాంతం నీ తోడు-నీడ-నేనే... నేస్తం!

---

# రెక్కలు

- రుద్రారం శ్రీనివాస్‌రెడ్డి



నిజం
నిదానం
అబద్దం
దావానలం -

నిజం
అమరదీపం

ఆకాశం
ఆర్కతేజం
సమావేశం
పాండిత్యం -

జగత్ప్రకాశం
మనోరంజకం

సహృదయంతో
సహవాసం
మల్లెతోటలో
విహారం -

సత్సంగం
మహానందం

అహంకారం
ఆవిరైతే
వినయం
వికసిస్తుంది -

అహం
వినాశహేతువు

దీపం చుట్టూ
చీకటి
పరిసరమంతా
ప్రకాశం -

సహకారమే
సజ్జనుల ఆశయం

సౌమ్యం
రమ్యం
సజావుగా
గమ్యం -

సుహృద్భావం
సుజనుల గీతం

రాజులు
లేరు
రాచరికాలు
లేవు -

వికసించిన
ప్రజాస్వామ్యం



# నిత్యాన్వేషణ నిరంతర సృజన : గిరిధర్

- గుడిపూడి విజయరావు

**వర్ణాల వినియోగంలో గిరిధర్ విలక్షణతను చాటుకుంటున్నారు. తన ఇంటివద్ద ఉన్న చెట్లు, చిన్న సరస్సులో పూలు, సమీపంలోని కాలువ గట్టు, అక్కడ కనిపించే పశువులు, పక్షులు మొదలైన వాటి పరిశీలన తన చిత్రరచనలో ఉపకరిస్తుందని ఆయన చెబుతున్నారు. ప్రకృతికి పూర్తి సారూప్యంగా ఉండే వర్ణాలను తాను ఆ ప్రకృతి మధ్యన ఉండి చిత్రించడం ద్వారా మాత్రమే సాధించగలుగుతున్నానని అంటున్నారు.**

సాధారణంగా ఒక ఆర్టిస్టు విద్యార్థి దశలో అనేక విషయాలు తెలుసుకుంటాడు, అనేక మంది సీనియర్ ఆర్టిస్టుల పనితనాన్ని పరిశీలిస్తాడు, వారిని అనుకరిస్తాడు, అనుసరిస్తాడు, స్వంతంగా తానూ తన భావాలను తనదైన శైలిలో వ్యక్తం చేయడానికి ప్రయత్నిస్తాడు. ఇవి తొలి అడుగులు మాత్రమే. ఆ తర్వాత తానొక ఇతివృత్తాన్ని ఎంచుకొని, దాన్ని తనదైన రీతిలో వెల్లడించడంలో పేరుసంపాదించిన తర్వాత ఆ ఆర్టిస్టుకు ఓ ముద్రపడిపోతుంది. ఆ ధోరణి విజయవంతమైతే ఆర్టిస్టు దాన్నే కొనసాగిస్తుంటాడు. ఆ ముద్ర పరిధిలోనే ఇమిడిపోయి దానిలోనే పరిభ్రమిస్తుంటాడు. దాని నుండి బయటపడేందుకు ప్రయత్నం కూడ చేయడు. విజయవంతమైన పాత బాటలోనే కొనసాగడం క్షేమమని, కొత్త ప్రయోగాలు చేసి చేతులు కాల్చుకోవడం ఎందుకనే ఆచరణాత్మక దృక్పథంతో ఉంటాడు.

పరిణత చిత్రకారుడు గిరిధర్ దీన్ని అంగీకరించడం లేదు. ''ఒక ముద్ర పడింతర్వాత దానికే పరిమితమయితే ఆ ఆర్టిస్టు సృజనాత్మక వయునం ముగిసినట్లేనని ఆయున భావిస్తున్నారు. మనం ఒకానొకదశలో అప్పటి పరిస్థితులను అధ్యయనం చేసి, దానికి అనుగుణంగా మన కళను తీర్చి దిద్దుకుంటాము. అప్పటికది మంచిదని గుర్తింపు కూడ పొందవచ్చు. కాని కాలగమనంలో మన అవగాహనా స్థాయి, అధ్యయన శక్తి అధికమవుతుంటుంది. అలాగే ప్రపంచం కూడ మనం తొలుత మొదలు పెట్టిన దగ్గరే ఆగిపోదు. ముందుకు సాగిపోతూ ఉంటుంది. అనేక నూతన మార్పులు చోటుచేసుకుంటాయి. వాటిని లోతుగా పరిశీలించి మన సృజనాత్మక కృషిలో భాగం చేసుకోవాలి. అప్పుడే ఆ ఆర్టిస్టు నిత్యనూతనంగా అభివృద్ధిచెందుతుంటాడు.'' అని గిరిధర్ అంటున్నారు. ఇటీవల గిరిధర్‌ను ఆయన స్వస్థలం తెనాలికి సమీపంలో గరువుపాలెం అనే చిన్నపల్లెటూరులో ప్రస్థానం మేనేజర్ లక్ష్మయ్య, సాహితీ మిత్రుడు జుగాష్‌లతోపాటు కలిసినపుడు ఇలాంటి అనేక విషయాలను చెప్పారు. తన తాజా చిత్రాలను చూపించి వివరించడంతో పాటు, తన భవిష్యత్ ప్రణాళికలను కూడ తెలియచేశారు. బరోడా, ఎంఎస్ విశ్వవిద్యాలయంలో ఫైనార్ట్స్‌లో పిజి చేసిన గిరిధర్, ఏదో ఒక నగరంలో స్థిరపడకుండా ఆ పల్లెటూరునే తన కార్యస్థలంగా ఎంచుకొని పనిచేస్తున్నారు.



కెరీర్ తొలిదశలో పౌరాణిక చిత్రాలను ప్రతిభావంతంగా చిత్రించే ఆర్టిస్టుగా తనకు పేరు వచ్చిందని, ఆ తర్వాత ఆంధ్రుల జీవనంలో విడదీయ రాని భాగమైన ఒంగోలు జాతి గిత్తలను పరిశీలించి, వివిధ భంగిమల్లో వేసిన వర్ణ చిత్రాలకు మరింత గుర్తింపు, ఆదరణ లభించా యని ఆయన చెప్పారు. ఇప్పుడు చాలమంది గిరిధర్ అనగానే ఆ ఎద్దుబొమ్మలు వేసే ఆయనేనా అని అంటున్నారని, అలా అనిపించు కోవడమే కచ్చితంగా తనకు ఇష్టం ఉండదని ఆయన పేర్కొన్నారు. ఒక మూసలో బందీ కాకుండా తన కళాజీవితంలో అనేక ఇతివృత్తాలను, విభిన్న శైలులను అనుసరించి ప్రఖ్యాతి వహించిన పికాసో లాంటి గొప్ప చిత్రకారుల నుండి తాను స్ఫూర్తిని పొందుతుంటానని అంటు న్నారు. ఒక దాని తర్వాత మరొక శైలిని చేపట్టడమే

కాకుండా, ఏకసమయంలో భిన్నశైలులను అనుసరించిన ఆర్టిస్టుగా కూడ పికాసోకు పేరుంది. భారతీయ సంస్కృతి, సంప్రదాయాలంటే తనకు ఎంతో మక్కువ అని, అంత మాత్రం చేత వాటిని గుడ్డిగా అనుకరించనని, వాటిలో మంచిని స్వీకరించి ముందుకు సాగాలన్నది తన అభిప్రాయం అని గిరిధర్ చెబుతున్నారు. ఇతివృత్తాల ఎంపికలోను, వాటిని చిత్రకళారూపంలోకి మలచడంలోను దాన్ని అనుసరిస్తానని అంటున్నారు.



వృషభ-1 సీరీస్‌లో దాదాపు 80 వర్ణచిత్రాలను కేన్వాసుపై అక్రిలిక్, వాటర్ కలర్స్, పేస్టెల్స్‌తో వేసి తన ప్రతిభను చాటుకున్న గిరిధర్ అదే ఇతివృత్తాన్ని మీనియేచర్ చిత్రాలుగా ఓ పూర్తిస్థాయి షోకు సరిపడిన సంఖ్యలో తయారుచేశారు. గత రెండేళ్లలో ఆయన చేసిన ప్రధాన కృషి ఇది. వృషభ-2 పేరుతో ఇది ప్రదర్శనకు సిద్ధంగా ఉంది. మీనియేచర్ చిత్రాలు భారతీయ సంప్రదాయంలో ఓ ప్రధాన భాగం. అలాంటి సంప్రదాయ చిత్రకళారీతిని తన ఇతివృత్తానికి అనుగుణంగా గిరిధర్ మలిచిన తీరు నిజంగా ప్రశంశనీయం. కేన్వాస్‌పై వర్ణచిత్రాల పరిధి విస్తృతమైంది, భావవ్యక్తీకరణ కూడ విశాలంగా ఉంటుంది. కాని మీనియేచర్ చిత్రాలలో అల్పంలో అనల్పభావాలను వ్యక్తంచేయాల్సి ఉంటుంది. ఈ మీడియంపై తన పట్టును మరింత పెంచుకొని భారతీయ మీనియేచర్ సంప్రదాయాన్ని అనుసరిస్తూనే ఈ పరివర్తనా విన్యాసాన్ని గిరిధర్ విజయవంతంగా నిర్వహించకలిగారు. వీటిలో కొన్నింటి కంపోజిషన్ కంటెంపరరీ చిత్రాలను తలపించే రీతిలో విశేషంగా ఆకట్టుకుంటున్నది.

ఇటీవల కాలంలో గిరిధర్ తల్లీబిడ్డల ఇతివృత్తంతో మరొక సీరీస్‌ను కూడ పూర్తిచేశారు. ఆసక్తికరమైన విషయం ఏమంటే దీనిలో బిడ్డ గణేశుడు, తల్లిదండ్రులు శివపార్వతులు. ఈ చిత్రాలలో పాత్రధారులు తమ పౌరాణిక ప్రధాన లక్షణాలకు భిన్నంగా కనిపించకుండానే, ఇప్పటి తల్లీబిడ్డల మాదిరిగా చిత్రీకరించబడతారు. వారిలో వ్యక్తం అయ్యే భావాలు, వారి భంగిమలు అన్నీ ఆధునికరీతిలో ఉంటాయి. పౌరాణిక రూపాలకు కంటెంపరరీ స్వభావాన్ని తీసుకురావడం ఈ చిత్రాలలో ప్రత్యేకత. ఈ కోవలోనే భిన్న రుతువులను గణేశుడు ప్రధాన అంశంగా కనిపించేలా ఆకర్షణీయమైన వర్ణ చిత్రాలను గిరిధర్ రూపొందించారు. ఆ చిత్రాలలో వర్ణాలు ఆయా రుతువులకు అనుగుణంగా ఉంటాయి, గణేశుని హావభావాలు ఆ రుతువును ప్రతిబింబించేలా ఉంటాయి.



గిరిధర్ ప్రస్తుతం మహా భారతంలోని పలు పాత్రలను తనదైన శైలిలో చిత్రాలుగా అనువదిస్తున్నారు. కుంతి, గాంధారి, ద్రౌపది, ధృతరాష్ట్రుడు, భీష్ముడు, కృష్ణుడు, అభిమన్యుడు మొదలైన వారి స్వభావాలను ఎంతో లోతుగా అధ్యయనం చేసి, వాటిని విభిన్నమైన, విలక్షణమైన రీతిలో తన చిత్రాలలో ప్రతిబింబిస్తున్నారు. ఉదాహరణకు భీష్ముని చిత్రం నిలువుగా రెండు సమ భాగాలుగా విభజించబడి ఉంటుంది. ఒక వైపు తేజోవంతంగా ఉంటే, మరొక వైపు నలుపుగా ఉంటుంది. భీష్ముడు అంత గొప్పవాడు అయినప్పటికీ ఆయన జీవితంలో అనుభవించింది శూన్యమని దీని ద్వారా గిరిధర్ చెబుతున్నాడు. కొన్ని శృంగార చిత్రాలను కూడ ఆయన చిత్రిస్తున్నారు. వాటిలో సాధారణ శృంగార చిత్రాలకు భిన్నంగా శృంగారభావనను ఎంతో సున్నితంగా, దృశ్యాదృశ్యంగా వ్యక్తం చేసిన తీరు ఆకట్టుకుంటుంది.

వర్ణాల వినియోగంలో గిరిధర్ విలక్షణతను చాటుకుంటున్నారు. తన ఇంటివద్ద ఉన్న చెట్లు, చిన్న సరస్సులో పూలు, సమీపంలోని కాలువ గట్టు, అక్కడ కనిపించే పశువులు, పక్షులు మొదలైన వాటి పరిశీలన తన చిత్రరచనలో ఉపకరిస్తుందని ఆయన చెబుతున్నారు. ప్రకృతికి పూర్తి సారూప్యంగా ఉండే వర్ణాలను తాను ఆ ప్రకృతి మధ్యన ఉండి చిత్రించడం ద్వారా మాత్రమే సాధించగలుగుతున్నానని అంటున్నారు. ఈ సందర్భంలోనే ఆయన తన చిత్రాలకు ఆధారాలయిన ఎన్నెన్నో స్కెచ్‌బుక్స్‌ను చూపించారు. వాటిలో కనిపించే స్పాంటేనిటీ, వేగం ఆశ్చర్యం గొలుపుతుంది. సాధారణంగా చిత్రకారులు స్కెచ్‌లను లైన్ డ్రాయింగ్ రూపంలో వేసుకుంటుంటారు. కాని అనేక స్కెచ్‌లను నేరుగా వాటర్ కలర్స్‌లోనే వేయడం గిరిధర్ ప్రత్యేకత.

ఓ గ్యాలరీలో గిరిధర్ చిత్రాలను చూసినప్పటి అనుభూతికి, తాను చిత్రించిన పలురకాల చిత్రాలతో ఆయనను చూడటంవల్ల కలిగిన అనుభూతికి ఎంతో తేడా ఉంది. ఒక ప్రదర్శనలో ఒక తరహా చిత్రాలు మాత్రమే చూడగలం. కాని గిరిధర్ పలురకాల చిత్రాలను ఒకేచోట, ఆయన పనిపద్ధతులతో సహా ప్రత్యక్షంగా పరిశీలించిపుడు ఆయనలో ఎంత పొటెన్షియాలిటీ ఉందో స్పష్టంగా అర్థమయింది. ప్రఖ్యాత ఆర్ట్ జర్నల్ "మార్గ" తాజాసంచికలో డా. అవనీ రావు ఆంధ్రప్రదేశ్ ఆధునిక, కంటెంపరరీ ఆర్ట్ గురించి రాసిన వ్యాసంలో పేర్కొన్నట్లు గిరిధర్ దృక్పథంలోను, వ్యక్తీకరణలోను కొత్త పుంతలు తొక్కుతున్న ప్రముఖ యువ చిత్రకారుల్లో ఒకరు. ✱

## 74వ వర్ధంతి

# ప్రజ్ఞాశాలి - ప్రజాయోధుడు


క్రిస్టఫర్ కాడ్‌వెల్

**- పొట్లూరి వెంకటేశ్వరరావు**

"గత కాలపు భూస్వామ్య కులీన వర్గంలోని
ఒక భాగం బూర్జువాగా మారినట్లు నేటి
బూర్జువా వర్గంలోని ఒక భాగం శ్రామిక వర్గం
వైపు మళ్ళారు. వీరు చారిత్రక చలనాలను
సైద్ధాంతికంగా సమగ్రంగా అర్థం చేసుకున్నారు"
**(మార్క్స్, ఎంగెల్స్)**

9-12-1936న లండన్ ఈస్ట్ ఎండ్ ప్రాంతంలో ఉంటున్న కాడ్‌వెల్ తన అన్నకు రాసిన లేఖ. అన్నా! నీవు ఆశ్చర్యపడతావు. శుక్రవారంనాడు స్పెయిన్ అంతర్యుద్ధంలో "ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లో చేరడానికి స్పెయిన్ వెళుతున్నాను. పార్టీ సభ్యుడుగా ఉండి కారు డ్రైవ్ చేయగలిగిన కామ్రేడ్స్ కావాలట. నాకు పాస్‌పోర్టు కూడా ఉంది. అందుకే నేను అంగీకరించాను." అదేరోజున మిత్రుడు బియర్టుకు రాసిన లేఖలో తాను రచించిన గ్రంథాల రాతప్రతుల పట్టికను వేసి వాటిని సరిచూడమన్నాడు. తాను తిరిగి రాలేమోననీ, వాటిలో అనేక కథలు, కవితలు ప్రకటించడానికి అర్హమైనవే కానీ, "క్రైసిస్ ఇన్ ఫిజిక్స్" "భ్రమ - వాస్తవం" అచ్చులో ఉన్నాయని చెప్పాడు.

ఆ దశలో కాడ్‌వెల్ స్పెయిన్‌కు బయలుదేరాడు. అతని అసలు పేరు సెయింట్ జాన్ స్ప్రిగ్. సర్ కామెట్ 13-12-1937 - రేడియో వార్త, "యువ రచయిత కవి మిస్టర్ క్రిస్టఫర్ సెయింట్ జాన్ స్ప్రిగ్ ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లో పోరాడుతూ...". 12-2-1937 నాటికి మూడు పదులైనా నిండకనే మరణించాడు.

29-10-1907 నాడు పుట్నీలో స్ప్రిగ్ జన్మించాడు. తల్లి జెస్సికా తన 8వ ఏటనే చనిపోయింది. లండన్‌లోని బెనిడైక్టైన్ పాఠశాలలో చేరి, 11వ తరగతి తరువాత ఫీజులు కట్టలేక చదువు చాలించాడు. సైన్సు, గణితంలో అద్భుతమైన ప్రతిభ కనబరిచాడు. పాఠశాల వదిలాక పత్రికా విలేకరిగా పనిచేశాడు. తరువాత వైమానిక సంబంధ గ్రంథ ప్రచురణ సంస్థలో పనిచేసి, మొదట ఎడిటర్‌గా, తరువాత ఆ సంస్థ డైరెక్టర్ స్థాయికి ఎదిగాడు. ఎన్నో రకాలుగా మారే 'మోటార్ గేర్'ను ఆవిష్కరించాడు. క్రిష్టఫర్ తయారుచేసిన అనేక పరికరాల డిజైన్లు "ఆటోమొబైల్ ఇంజనీర్" అనే పత్రికలో ప్రచురించబడ్డాయి. వైమానిక విజ్ఞానశాస్త్రంపై ఐదు గ్రంథాలు ప్రచురించాడు.

కాడ్వెల్ తొలి నవల "ఇది నా హస్తం" 1935లో ప్రచురితమైంది. 1927-29 మధ్యకాలంలో సైన్సు - కవిత్వంపై ఆసక్తితో లోతైన అధ్యయనం చేశాడు. ఈ అధ్యయనం ఫలితం కాడ్‌వెల్ ప్రఖ్యాత గ్రంథం "భ్రమ - వాస్తవం"లో సంగమించింది. 1927లో కాడ్వెల్ తొలి కవిత "ఒకసారి నేననుకున్నాను" అచ్చులో వచ్చింది. తరువాత "ఆటోమొబైల్ ఇంజనీర్" అనే గ్రంథం ప్రచురించబడింది. 1931లో 'Air Strip', 1932లో 'Fly with me' అనే గ్రంథాలు ప్రచురించబడ్డాయి.

కాడ్‌వెల్‌కు వచ్చిన ప్రశ్న "శిఖరాలకు చేరిన మానవ విజ్ఞాన జ్యోతుల మధ్య సమైక్యత లేదా? "సమైక్యతను సాధించడానికి కాడ్వెల్ ప్రయత్నించాడు. దీనినే కాడ్వెల్ మార్క్సిజంలో చూశాడు. ఈ ఆలోచనా ప్రతిబింబాలనే "భ్రమ - వాస్తవం"లో చూస్తాం. (27-11-35)" 'నాలో గల పెద్ద లోపం - నా ఉద్వేగశీల, కళాత్మక, శాస్త్రీయ ఆలోచనల మధ్య సమైక్యత లేదు. నా రచనలకు, పరిసరాలకు మధ్య సంబంధం ఉండాలి. దీనికోసమే నేను ఒకటి, రెండు సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నాను."

ఈ ఆలోచనలు ఎలా ఉన్నా, కవి రచయితా కూడా బతకాలి. అందుకు డబ్బు కావాలి. అందుకే డిటెక్టివ్ నవలలు, జనాకర్షక పత్రికా రచనలను చేపట్టాడు. వీటినే భ్రమ - వాస్తవంలో గట్టిగా విమర్శించాడు. "ఇవి పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆకలితో కృశిస్తున్న సహజాతాలను విస్పష్టంగా తృప్తిపరచే రచనల"న్నాడు.

1934లో కాడ్వెల్ ఒక తీరిక లేని రచయిత. డిటెక్టివ్‌లు, విమానయానంపై వ్యాసాలు రాస్తూనే వున్నాడు. ఈ కాలంలోనే మార్క్సిజంపై అధ్యయనాలు కాడ్వెల్ ప్రారంభించాడు. జాన్‌స్ట్రాచీ రాసిన

ప్రఖ్యాత గ్రంథం "అధికారం కోసం రాబోయే పోరాటాలు" కాడ్‌వెల్ చదివాడు. ఈ గ్రంథ ప్రభావం 'భ్రమ - వాస్తవం'లోనూ, 'భ్రష్ట సంస్కృతీ అధ్యయనాల్లో' స్పష్టంగా కనబడుతుంది. దీనికి ముందుమాట రాస్తూ స్ట్రాచీ ఇలా అన్నాడు. "మతం, సైన్సు సాహిత్యాలు భ్రష్టు పట్టి పవనం అంచుకు చేరే ప్రక్రియలోనున్నాయి. ఎందుచేతనంటే అవి పతనమవుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థతో ముడివేసుకుని ఉన్నాయి.




"చావుకు దగ్గరబడ్డ పెట్టుబడిదారీ విధానాన్ని బతికించడం అసాధ్యం. దాని నిర్మాణం పైన నాగరికత కూలిపోతుంది" (స్ట్రాచీ) ఇదే విషయాన్ని "స్వేచ్ఛ - బూర్జువా భ్రమ" అనే వ్యాసంలో కాడ్వెల్ ఇలా అన్నాడు. "కళలు, తత్వశాస్త్రం, జీవ, భౌతిక విజ్ఞాన శాస్త్రాలతో గల బూర్జువా సంస్కృతే సంక్షోభానికి కారణం. ఇది యాదృచ్ఛికం కాదు. ఈ రుగ్మతే బూర్జువా సంస్కృతి యొక్క చలనశీల శక్తి. ఇప్పుడు దాని సర్వశక్తులు ఉడిగిపోయాయి. బూర్జువా సంస్కృతి భ్రమల మరణంలో ఉంది."

కాడ్వెల్ కాలం నాటి ఇంగ్లండ్‌లోని శక్తివంతమైన ఆలోచనల నాడీ కేంద్రం స్ట్రాచీ. శాస్త్రవేత్తల గురించి ఆయన ఇలా అన్నారు. వర్తమాన పోరాటాలతో సంబంధం లేక విజ్ఞాన శాస్త్రాలు ఒక రకమైన శూన్యంలో ఉండిపోయాయి. ఆ కాలపు శాస్త్రవేత్తలైన ఫ్రాయిడ్, వెల్స్, లారెన్స్, పాల గురించి కాడ్వెల్ తన గ్రంథ "అధ్యయనాలలో" విపులంగా విశ్లేషించాడు.

"ఇది నా హస్తం"లో నిష్క్రియాశీలుర పాపాలను గురించి ఇలా అన్నాడు. "ఏమీ చేయని వారి పాపాల కంటే క్రియాశీలుర పాపాలు చాలా తక్కువ. వీరే నిజమైన పాపాత్ములు (క్రిమినల్స్). దుర్మార్గం మొత్తం వీరి నుండే వస్తుంది."

కాడ్వెల్ నవలలు, వ్యాసాలు, డిటెక్టివ్స్ లెక్కకు మించి ఉన్నాయి. "భ్రమ - వాస్తవం" , "క్రైసిస్ ఇన్ ఫిజిక్స్" "స్టడీస్" "ఫర్దర్ స్టడీస్ ఇన్ డైయింగ్ కల్చర్", "ఇది నా హస్తం" మొదలైనవి కాడ్వెల్ కీర్తి కిరీట తురాయి గ్రంథాలు.

1935లో కాడ్వెల్ కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. పగలంతా టైప్‌మిషన్‌పై పని. సాయంత్రం క్రిప్స్ స్ట్రీట్‌లో "డెయిలీ వర్కర్" పార్టీ పత్రిక అమ్మేవాడు. తూర్పు లండన్‌లోని పార్టీ శాఖ కార్యదర్శిగా పనిచేశాడు. లండన్‌లోని కార్మిక పాఠశాలలోని "మార్క్సిజం - సాహిత్యం" తరగతులకు హాజరయ్యేవాడు. అక్కడే ప్రవేశ ద్వారం వద్ద "డెయిలీ వర్కర్స్" అమ్మేవాడు. ఒకసారి తన అన్నతో ఇలా అన్నాడు. "నేను పార్టీ పని మానేస్తే నేనేం రాయాలో నాకేం తెలుస్తుంది. ఇదే కమ్యూనిస్టుకు, కమ్యూనిస్టు సానుభూతిపరులకు మధ్య ఉండే తేడా." స్పెయిన్‌కు చేరాక పోప్‌లాండ్ కామ్రేడ్స్‌కు రాసిన లేఖ "ఇక్కడకు వచ్చాక నేను ఒక బృందానికి రాజకీయ ప్రతినిధిని. లేబర్ పార్టీ ఫ్రాక్షన్‌కు బోధకుణ్ణి. గోడ రాతల పత్రికకు ఎడిటర్‌ను. కీలక సమయాల్లో పార్టీ కఠినమైన నిర్ణయాలు తీసుకుంటుంది. 7-2-37 నాడు రాసిన లేఖ "మూడు, నాలుగు రోజుల్లో మా బెటాలియన్ వాస్తవ పోరాటంలో పాల్గొనవలసి వుంది. తుపాకులు పేల్చే సమయం దగ్గరపడింది. అవి వసంత రుతువు తొలి దినాలు. ఆ యుద్ధం ముఖ్యమైన మూడు రంగాలు. 1. మాలగా రంగం 2. జరామా నది పరిసరాల రంగం 3. గ్వాడ్లా జరా పట్టణానికి బయట మరో రంగం. మాలగా రంగంలో సాధించిన విజయం ఫ్రాంకోస్ ముష్కర సైన్యానికి ఉత్సాహాన్నిచ్చింది. జరామా లోయపై ఆకస్మిక దాడులకు పురికొల్పింది.

11-2-37 నాడు ఫ్రాంకోయిస్ సైన్యం జరామా నదిని దాటింది. ఇంటర్నేషనల్ బ్రిగేడ్ ఒకటవ బెటాలియన్‌పై దాడి చేసింది. అది భయంకర పోరాటం. ఇందులోని యోధులకు ఇది ప్రథమ పోరాటం. భయంకరమైన బాధ్యత వారిపై పడింది. ఫింగారో కాంగీలను రక్షించాలి. ఈ కొండలే తరువాత "ఆత్మ పరిత్యాగ గిరులు"గా పేరు పొందాయి (Hills of Sacrifice).

టాంకులు, ఫిరంగుల దాడి. విషాదం! ఆ సాయంత్రానికి బ్రిటిష్ బెటాలియన్‌లోని 600 మందిలో 250 మంది మిగిలారు.

1927లో "జరామా యుద్ధం"పై ఆ బెటాలియన్ సభ్యుడు ఒకరు రాసిన కవిత.

"ఉదయ రవి కిరణాలు లోయను తాకాయి
అయినా పక్షుల కిల కిల రావాలు మూగపోయాయి
అంబరాన బాంబుల ధ్వనుల ప్రతిధ్వనులు
తుపాకి గుళ్ళ లోహపు మోతలు
ఆలివ్ చెట్లపై మరణాల నీడలు
యముని ఇనుప హస్తం!
మరల మరల పిలుస్తోంది!!

ఇక్కడే 12-2-1937 నాడు కాడ్వెల్ అమరుడయ్యాడు.

కాడ్వెల్ తాను గతంలోనే రాసుకున్నాడు.
"దురదృష్టవంతుడు తీరిన ఆశల
తీరాల్లో తిరుగుతూ వుంటాడు
ఆసన్నమైన బాధామయ మరణాన్ని ఆలోచించడు
మనసా వాచా మహనీయుడు సెల్యూకస్ అలాంటివాడే
ఒక శ్వాస కోసం - ప్రపంచపు అంచులు
స్పెయిన్ తీరాలో అనామకుడిగా, అజ్ఞాత వీరుడిగా
తెలియని తీరాల దూరాలకు తరలిపోయాడు.

**(ఇది లాటిన్ కవితకు కాడ్వెల్ అనువాదం)**

క్రిష్టఫర్ సెయింట్ జాన్ స్ప్రిగ్ -కవి, కథా రచయిత, నవలాకారుడు, పత్రికా విలేకరి, వ్యాపారవేత్త, వైమానికుడు, వైమానిక శాస్త్రజ్ఞుడు, బహు గ్రంథ రచయిత, బహుముఖ ప్రజ్ఞాశాలి ఆపై కమ్యూనిస్టు యోధుడు.

కేవలం ఒకే ఒక సంవత్సరం శ్రామిక జనంతో భుజం కలిపిన కాడ్వెల్ - కామ్రేడ్ లెనిన్ చెప్పిన విప్లవకారుని విధుల్లో 2/3వ వంతు నెరవేర్చాడు.

- కొంతకాలం రహస్యంగా
- కొంతకాలం మారుపేర్లతో
- కార్యకలాపాలు సాగించిన

జాన్ స్ప్రిగ్ సెంటిమెంటల్ గీతానికి చివరి సంవత్సరాల కార్యకలాపాలు చిరస్మరణీయమై క్రిష్టఫర్ కాడ్వెల్ పేరుతో గణుతికెక్కారు.

అమరుడైన మహనీయునికి రెడ్ సెల్యూట్ !

■

చిన్న కథ

# కల్పతరువు



**పర్సులోని విజిటింగ్‌కార్డులన్నీ తీసి, అడ్రస్సులు, ఫోన్ నెంబర్లు ఒకసారి చూచి వరసగా ఫోన్లు చేయడం మొదలుపెట్టిన రవికి సరియైన సమాధానం ఎవరి నుండి అందకపోయే సరికి విసిగిపోయాడు.**

**- కల్లూరు రాఘవేంద్రరావు**

ఇక మూడు కార్డులే మిగిలున్నాయి. వాటినో సారి తదేకంగా చూసి 'లాస్ట్ అండ్ ఫైనల్' అంటూ నిశ్చయించుకొని, కళ్లు మూసుకొని ఓ కార్డెత్తి, ఆ నంబరుకు రింగ్ చేసాడు రవి.

రింగైంది

ఎవరో ఎత్తారు వెంటనే రవి "హలో శివరావుగారేనా! అని అడిగాడు "అవును మీరు....." అంటు ఇటు వైపు గొంతు.

"రాత్రి బస్సులో మీరేదైనా పోగొట్టుకొన్నారా? సార్" అడిగాడు రవి

"అవునవును... నా బావమరిది పర్సుపోయింది ఇంతకూ మీరెవరు?" అన్నాడు శివరావు ఆశ్చర్యంగా.

"నా పేరు రవి. అది నాదగ్గరుంది మీరొస్తే ఇచ్చేస్తా అడ్రసు రాసుకోండి" అన్నాడు రవి నిస్సంకోచంగా.

"అలాగా!..సరే చెప్పండి" అంటూ రాసుకొని ఫోన్ పెట్టేసాడు శివరావు.

శివరావు బావమరిది నారాయణరావు. అతను హైదరాబాద్ నుండి వస్తూ మనీ పర్సు పోగొట్టుకొన్నాడు. ఆ విషయం బావకు రాత్రి రాగానే చెప్పాడు నారాయణరావు. విషయం తెలిసిన శివరావు రవి ఫోను చేసిన విషయం బావమరిదికి చెప్పాడు. దానికతను అనుమానంగా స్పందిస్తూ,

"దొరికిందాన్ని తిరిగిచ్చేవాళ్లు ఈ కాలంలో ఎవ్వరూ లేరు బావా!" అన్నాడు.

"నిజమే! అడ్రసిచ్చి కలువమన్నాడు గదా" అన్నాడు శివరావు "అది సరైందని ఎలా నమ్మడం? ఆ పర్సులో నా అడ్రస్సు కార్డు కూడ వుంది మరి. నాకెందుకు ఫోన్ రాలేదు? అన్నాడు నారాయణరావు న్యాయబద్ధంగా.

"నా నంబరుకు చేసాడు లక్కీగా రిప్లయ్ వచ్చింది. అందుకే ఇంకెవ్వరికీ చేసుండడు" అన్నాడు శివరావు.

"అంటే ఆ పర్సులో వున్న అడ్రస్సుదార్లందరికీ ఫోన్లు చేసుంటాడని మీరు నమ్ముతున్నారా? అంతఖర్చు, శ్రమ ఎవరు తీసుకొంటారు బావా!" అన్నాడు నారాయణరావు సందేహంగా

"ఏమైనా....ఇతనెవరోగాని, చాల నిజాయితీపరుడిలా కనిపిస్తున్నాడు." అన్నాడు శివరావు రవి చెప్పిన మాటతీరుబట్టి.

"వెళ్లి కలిసినా వాడిచ్చేది.. ఖాళీపర్సే!" అన్నాడు నారాయణరావు నమ్మకం ఏమాత్రం లేని వాడిలా.

"ఆ మాత్రానికంతగా శ్రమ తీసుకోడు కదా" రవి మీద పూర్తి గౌరవముంచి మాట్లాడాడు శివరావు.

"ఇదో రకం ట్రిక్ అందులో ఏ.టి.ఎం. కార్డులున్నాయి. కదా! వాటితో ఏమాత్రం వాడికి ప్రయోజనం లేదు. అవి ఇవ్వడానికే పిలుచుంటాడు. ఏదో కొంత లాగొచ్చని...." అన్నాడు నారాయణరావు అపహాస్యంగా.

ఆ మాటతో శివరావు కొద్దిసేపు మౌనం వహించి, తుదకొనిశ్చయానికొచ్చి

"ప్రతిది నెగిటివ్‌గా థింక్ చేయడం మానవుని కున్న ఓ సహజ స్వభావం. అది విడిచి పెట్టి మనం వెళ్లొస్తే తప్పేముంది? అన్నాడు శివరావు బాగా ఆలోచించి.

నారాయణరావులో కూడా ఓ వైపు ఆశ లేకపోలేదు దాంతో 'సరేనంటూ' ఇద్దరు బస్సెక్కారు.

రవి ఇల్లు చేరారు.

ఇంటికొచ్చిన వాళ్లను రవి సాదరంగా ఆహ్వానించాడు పరిచయాల తర్వాత హాల్లో కూర్చొన్నారు.

అతని ఇల్లు సాధారణంగా వుంది. అతడేమంత స్థితిమంతుడుగా కనిపించలేదు వాళ్లకు.

బస్సులో వస్తున్న తనకు సీటు వెనకపడున్న మనీ పర్సు కనిపించిందన్నాడు రవి.

మరొకడు దాన్ని కాజేస్తువుంటే, అనుమానం వచ్చి తనదని చెప్పి భద్రపరచాడట.

తనదికాని పర్సుతీస్తుంటే ఎందుకో కాస్త జంకిందట మనసు.

అయినా, ఎవరిదో తెలుసుకొని వాళ్లకప్పగిస్తే మంచిది కదా! అని అనుకొన్నాడట.

బస్సులో ఏఒక్కరూ పర్సుపోయిందని ఆందోళన పడ్డవారే కనిపించలేదట.

దాంతో ఇది దిగిపోయిన ప్యాసింజర్‌దై వుంటుందనుకొన్నాడట.

ఇంతలో వూరొస్తే దిగేసాడట.



వివరాలకోసం ఇంట్లో పర్సు తెరిస్తే అందులో ఈ అడ్రస్సు కార్డులు కనిపించాయట.

తరువాత వరుసగా ఫోన్‌కాల్స్ చెసాడట.

రవిమాటలు వింటూ శివరావు, నారయణరావులు ఓ వింతైన ఆశ్చర్యంలో మునిగిపోయారు.

ఆ ఇంటావిడ అప్పుడే టీలు తెచ్చింది

టీలు తీసుకోమని రవి వాళ్లిద్దర్నీ హెచ్చరించాడు.

ఇద్దరూ ఈ లోకంలోకొచ్చారు.

అప్పుడు రవి "సార్! మిమ్మల్ని అనుమానించి అడగడంలేదు. మీ వస్తువు తాలూకు గుర్తులు చెప్పగలిగితే, ఎవరి సొమ్ము వాళ్లకు అందించాననే సంతృప్తి మిగులుతుంది. నాకు అన్నాడు రవి వినయంగా

"షూర్! మీకు నమ్మకం కలిగినప్పుడే ఆ సొమ్ము మాదవుతుంది. నిజం కాదా!" అంటూ నారాయణరావు వైపు తిరిగి చూస్తు అన్నాడు శివరావు.

'నా సొమ్ము మీద నాకే పరీక్షపెట్టాడన్నమాట' అని మనసులో గొణుక్కొంటూ వివరాలు చెప్పడం మొదలుపెట్టాడు నారాయణరావు.

"వేయిరూపాయల నోట్లు ఐదు. ఎస్.బి.ఐ, కెనరా బ్యాంక్, ఐసిఐసిఐ, సిండికేట్, కేవిబి ల ఏటియం కార్డులు. కొన్ని మా మిత్రుల, ముఖ్యుల అడ్రస్సు కార్డులున్నాయి. అందులో" అన్నాడు నారాయణరావు ధీమాగా.

వెంటనే రవి "ఇదేనా......." అంటూ పర్సు చూపాడు. నారాయణరావు దాన్ని గుర్తుపట్టి, "అవును - నాదే" అన్నాడు సంతోషంగా.

"మీరు చెప్పినవన్నీ ఇందులో ఖచ్చితంగా వున్నాయి. మీ సొమ్ము మీకు చేర్చాను. ఇప్పుడు నాకు సంతోషంగా వుంది." అంటూ పర్సు అందిచాడు రవి నిండుమనసుతో.

"మీ అంతటి నిజాయితీ పరుణ్ణి నే నెక్కడా ఇంతవరకూ చూడలేదంటే నమ్మండి. మీ ఆదర్శం మాకు మార్గదర్శకం అంటూ అప్పుడు నారాయణరావు అతని యెడ గౌరవభావం ప్రకటిస్తూ మాట్లాడాడు.

వెంటనే శివరావు,

మీ గొప్ప గుణానికి కృతజ్ఞతలు మిమ్మల్ని ఇంతటి గొప్ప సంస్కారవంతులుగా తీర్చిన ఆ పెద్దలకు శతకోటి వందనాలు." అన్నాడు నిండు హృదయంతో

"మాకీ జీవిత సత్యాలను నూరి పోసింది మా గురువుగారు. ఆయన శిక్షణలో మేము ఇవన్నీ నేర్చుకొన్నాం" అన్నాడు రవి

"మీ రెక్కడ చదివారు" అడిగాడు నారాయణరావు.

"హిందూపురం హైస్కూల్లో సీతాపతి రావుగారి దగ్గర" అన్నాడు రవి

"ఆ సీతాపతిరావుగారు నాకు మామగారు. ఈ నారాయణరావు అతని కుమారుడే! అన్నాడు శివరావు ఆశ్చర్యపోతు.

"అవునా! చాలా సంతోషం మా గురువుగారిని చూచినట్లేవుంది నాకు" అంటూ సంతోషపడ్డాడు రవి.

"మిమ్మల్ని ఇంతగొప్పవ్యక్తిగా తీర్చిన ఆ మహనీయుడు మా తండ్రికావడం మా అదృష్టం. ఆయన కుమారుల్ని కంటే శిష్యుల్నే ఎక్కువగా ప్రేమించేవారు. మీరిప్పుడు ఏం చేస్తున్నారు?" అడిగాడు నారాయణ కళ్లల్లో నీళ్లు నింపుకొంటు.

"ఓ టీ బంకు పెట్టుకొన్నాను నిజాయితీగా జీవనం చేస్తున్నాను. మా గురువుగారు మాకెప్పుడూ జీవితవిలువల్ని నూరిపోసేవారు. పరుల సొమ్ము తాకొద్దు అనేవారు" అంటూ రవి వినయంగా చెప్పాడు.

ఆ మాటలు నారాయణరావు చెవుల్లో గింగురు మంటున్నాయి. ఆ నిజాయితీ పరుడికి శతకోటి వందనాలు తెలుపుతూ అశ్రునయనాలతో పర్సుతీసుకొని మెట్లు దిగారు బావ, బావమరిది. ఆటోలో ఎక్కుతూ నారాయణరావు "బావా! పరులు గుర్తించినంత గొప్పగా మనం మన వాళ్లను గుర్తించమనేది సత్యం. అది మన పెరట్లో పెరిగిన కల్పతరువని గుర్తించలేకపోయాను. నాకు చాలా సిగ్గుగా వుంది. క్షమించు బావా! అంటూ కంటతడిపెట్టాడు నారాయణరావు. అతని భుజంతట్టి సమాధానపరచాడు శివరావు.

●

# ఎండమావి

- చెళ్ళపిళ్ళ శ్యామల



వర్షపు జల్లులతో
కరగిన మట్టి వాసన కోసం
నా ముక్కు పుటాలు
ఎగిరెగిరి పడుతుంటే
నల్ల త్రాచులా...
తారు రోడ్డు ఎదురొచ్చి
నా ముక్కుకి కళ్ళెం వేసింది!

పచ్చని గరిక తివాచీ
పరచిన మైదానంలో
ఆదమరచి నిదుర పోవాలని
నా కళ్లు ఆశపడుతుంటే
రంగుల హరివిల్లులా...
గ్రూపు హౌసు లెదురొచ్చి
నా కళ్ళు బైర్లు కమ్మాయి!

జలపాతంలా దూకుతూ
పాదరసంలా జారుతూ
ఎర్రకాల్వలో ఈతకొట్టాలని
మేనంతా పులకరించి పోతుంటే
ఊరి చెత్త కుండీగా మారిన
ఎండిన ఎర్రకాల్వను చూసి
నా మేను నీరుగారి పోయింది!

సహజ రుచుల కోసం
నోరు వెళ్ళబెట్టి
నా నాలుక ఎదురు చూస్తుంటే
గల్లీకో నూడుల్స్ కార్నర్
వీధికో హాట్‌స్పాట్ సెంటర్లు
ఎదురొచ్చి....
నా నోటికి తాళం వేశాయి!

శ్రావ్యమైన
సెలయేటి పిల్లగాలి సవ్వడి
వీనుల విందై...
వేడుక చేస్తుందనుకుంటే

వాహనాల రణగొణ ధ్వనులు
హోరెత్తి...
నా చెవులు చిల్లులు పడుతున్నాయి
ఎ.... ప్పట్నించో....
నాదో కోరిక
ఖరీదైనదేం కాదు
కొనవలసిందీ కాదు
కాలగర్భంలో కలిసి పోయిన
జ్ఞాపకాల పొరల్ని తవ్వి...
తనివితీరా ఒళ్ళంతా పూసుకోవాలని
సహజత్వాన్ని చూస్తూ...
మైమరచి పోవాలనీను

అంతే...
కానీ...
సాంస్కృతిక కాలుష్యం చుట్టుకొని
నగరంగా మారిన నా ఊరు
ఎందరికో... ఓ దర్శనీయస్థలం
నా... కెందుకో...
జ్ఞానేంద్రియాలూ చచ్చుబడిన
జీవచ్ఛవంలా కనిపిస్తోందీ క్షణం!
అప్పుడు తెలిసింది నాకు
నా కోరికో ఎండమావని!

---

# రెక్కలు

- గోపాలుని వెంకటేశ్వర్లు

మొన్నటి పెళ్ళికూతురు
ఈరోజు
అమ్మమ్మగా
మనవడ్ని సమదాయిస్తూ –

జీవితం
థ్రిల్లర్



రక్తసంబంధాలకు
కూడా
రంగులు
మారుతున్నాయి –

జీవితం
నెత్తురు ఊబి

ఇవాళ్టి
సమస్య నుండి గట్టెక్కినా
రేపు
మరో సమస్యరావచ్చు –

జీవితం
అక్షయ సమస్యల తూణీరం

యాక్సిడెంట్‌లో
హెల్మెట్ లేనిపుర్రె
రక్తాన్ని
ఎగజిమ్ముతూ –

రీప్లే లేనిదే
జీవితం

ఎన్నిలెక్కలు
వేసుకున్నా
సుఖాల కంటే
కష్టాలే ఎక్కువ –

జీవితం
మునిగే పడవ

వెదక బోయిన తీగ
కాలికి
ఎప్పుడు
తగులుతుందో ఏమో? –

జీవితం అంటే
గమ్యం తెలియని గమనం

కాలప్రవాహంలో
అలసిన నల్ల వెంట్రుకలు
తెల్లగా
మారుతూ –

జీవితం
ట్రాజెడి

నవ్వడం
బలం..
ఏడుపు
బలహీనత... –

జీవితం
డిజిటల్ త్రాసు

# జీవితం ఓ పుస్తకం



- దుర్గాప్రసన్న

ఆశలు–
జీవితాన్ని నడిపించేవి
ఆశయాలు–
జీవన గమనాన్ని నిర్దేశించేవి
భూమీ ఆకాశాల
అంతరాల్లా
ఆశ–ఆశయాల మధ్య
చివరకు మిగిలేది
ఓ జీవిత కాలపు అనుభవం
నిలిచి ఉంటుంది
చరిత్రగా
కొత్త జీవితానికి
మార్గదర్శనంలా
ప్రతి జీవితం ఓ తెరిచిన
పుస్తకం
అనుభూతుల ప్రవాహం
ఆహ్వానించి అల్లుకుపోయేది
పుస్తకం
జీవితం ఓ పుస్తకం

## శ్రీ కృష్ణ కమిటీ నివేదిక



# రాజ్యాంగ ఏర్పాటా? రాష్ట్ర వేర్పాటా?

**- తెలకపల్లి రవి**

> శ్రీ కృష్ణకమిటీ నివేదిక పనికి మాలినదనీ, చెత్త అని, నాలుక గీసుకోవడానికి కూడా పనికి రాదని, తప్పులు తడక అని తెలంగాణా విభజన వాదులు వ్యాఖ్యలు కురిపిస్తున్నారు. ఇంతకూ ఆయన చేసిన పని అన్ని పక్షాల ప్రాంతాల ప్రజల అభిప్రాయాల సేకరణ, క్రోడీకరణ మాత్రమే. ఈ క్రోడీకరణలో విభజన వాదులు లేవనెత్తిన అనేక ఫిర్యాదులు నిజమేనని ఆయన తేల్చారు. అదే సమయంలో నిధుల కేటాయింపు, నదీ జలాలు ప్రాజెక్టుల వంటి పూర్వాపరాలను, సాంస్కృతిక అసమానతలపై యాంత్రిక వాదనలను తోసిపుచ్చారు. పరిష్కారాలు చెప్పేప్పుడు కూడా అన్ని కోణాల నుంచి సూచనలు చేశారు. ఇవన్నీ చూడకుండా కొన్ని అప్రియ సత్యాలు చెప్పారు గనక శ్రీకృష్ణకమిటీ నివేదికనే తిట్టిపోయడం రాజకీయ ప్రచారానికే పనికి వస్తుంది.

కేంద్ర మంత్రివర్గ విస్తరణలో భాగంగా తెలంగాణా ప్రాంత ఎంపిలు పదవులు తీసుకోరాదని టిఆర్ఎస్ ఎంత చెప్పినా అది జరిగే పని కాదని అందరికీ తెలుసు. సదరు కాంగ్రెస్ ఎంపిలు కుండబద్దలు కొట్టి మరీ పదవులు వదులుకోబోమని చెప్పడంలోనే అది తేలిపోయింది (తీరా ఏ పదవులు వచ్చిందీ లేదు). రాష్ట్ర భవిష్యత్తుకు సంబంధించిన శ్రీకృష్ణకమిటీ నివేదికపై కేంద్రం వైఖరి ఎలా వుంటుదన్న దానిపైనే అందరి దృష్టి కేంద్రీకృతమై వుంది. అవిభక్త రాష్ట్రంలో తెలంగాణాకు రాజ్యాంగపరమైన రక్షణలు ఏర్పాటు చేయడం అత్యుత్తమ మార్గమని దేశానికీ మంచిదని కమిటీ చెప్పింది. విభజన అనివార్యమైన పరిస్థితుల్లోనే అది కూడా అందరి ఆమోదంతోనే జరగాలని కూడా స్పష్టం చేసింది. ఇప్పుడు జరగాల్సింది దీనిపై చర్చ, నిర్ణయం తప్ప పదవులు పరిత్యాగాలూ కాదు. వాటివల్ల ఒక రాజ్యాంగ రాజకీయ సమస్యకు పరిష్కారం లభించగలదన్న ఆశ కూడా ఎవరికీ లేదు. పైగా అందరం తెలంగాణా వాదులమేనని ఎంత చెప్పినా ఏ పార్టీ ప్రయోజనాలు ఇంకా చెప్పాలంటే ఏ నాయకుని ప్రయోజనాలు వారికి వుంటాయి.

శ్రీ కృష్ణకమిటీ నివేదిక పనికి మాలినదనీ, చెత్త అని, నాలుక గీసుకోవడానికి కూడా పనికి రాదని, తప్పులు తడక అని తెలంగాణా విభజన వాదులు వ్యాఖ్యలు కురిపిస్తున్నారు. ఇంతకూ ఆయన చేసిన పని అన్ని పక్షాల ప్రాంతాల ప్రజల అభిప్రాయాల సేకరణ, క్రోడీకరణ మాత్రమే. ఈ క్రోడీకరణలో విభజన వాదులు లేవనెత్తిన అనేక ఫిర్యాదులు నిజమేనని ఆయన తేల్చారు. అదే సమయంలో నిధుల కేటాయింపు, నదీ జలాలు ప్రాజెక్టుల వంటి పూర్వాపరాలను, సాంస్కృతిక అసమానతలపై యాంత్రిక వాదనలను తోసిపుచ్చారు. పరిష్కారాలు చెప్పేప్పుడు కూడా అన్ని కోణాల నుంచి సూచనలు చేశారు. ఇవన్నీ చూడకుండా కొన్ని అప్రియ సత్యాలు చెప్పారు గనక శ్రీకృష్ణకమిటీ నివేదికనే తిట్టిపోయడం రాజకీయ ప్రచారానికే పనికి వస్తుంది. ఒక ఉప ప్రాంతానికి సంబంధించిన నాయకులు కేవలం ఆ ఒక్క కోణం నుంచే మాట్లాడవచ్చు గాని దేశాన్ని, రాష్ట్రాన్ని గమనంలో వుంచుకోకుండా పరిష్కారాల గురించి ఆలోచించడం ఎలా సాధ్యం?

శ్రీ కృష్ణకమిటీ తెలంగాణా ప్రాంత ప్రయోజనాల రక్షణకు రాజ్యాంగ ఏర్పాట్లను గురించి చేసిన ప్రతిపాదన విఫల ప్రయోగం అని విమర్శకులు ఆగ్రహించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. గతంలో (భద్రాచలం మినహా) తెలంగాణా శాసనసభ్యులందరితో పని చేసిన ప్రాంతీయ మండళ్లు విఫలమైనాయంటే కారణం రాజకీయ నిర్లక్ష్యమే. వాటిని అచ్చంగా అదే రీతిలో పునరుద్ధరించి అదే విధంగా విఫలం కానివ్వాలని లేదు. ఎందుకంటే ఇంతగా రగిలిన చైతన్యం మటుమాయమై పోవడం అసంభవం. గతానుభవాలను బట్టి

అప్పటికంటే నికరమైన రాజ్యాంగ రక్షణలతో పకడ్బందీగా నిర్వహించవచ్చు. పైగా సారథులు తెలంగాణా ప్రాంత నేతలే గనక ఎలాంటి అన్యాయం అసమానతలు తలెత్తకుండా చూడవచ్చు. అయినా విఫలం కావడం అనివార్యమనేట్టయితే అప్పుడు రాష్ట్ర విభజన మాత్రం సర్వరోగ శాశ్వత నివారిణి అని చెప్పగలవారెవరైనా వుంటారా? ఒక్కదెబ్బతో విడదీసిన (అది కూడా ఆదివాసీ, కొండ ప్రాంతాల కొలబద్దతో) చత్తీస్‌ఘర్, జార్ఖండ్, ఉత్తరాంచల్ వంటి రాష్ట్రాలు సమస్యారహితమైన స్వర్గధామాలుగా వెలిగిపోతున్నాయా? వేర్పాటును సమర్థించే మావోయిస్టులు అక్కడెందుకు ప్రాణాంతకదాడులకు పాల్పడుతున్నట్టు? సర్కార్లు సాల్వాజుడుంల వంటి అవాంఛనీయ పద్ధతులతో జన హననం కావించడమెందుకు? కనక రాజ్యాంగ ఏర్పాటైతే విఫలం కావడం తథ్యమనీ రాష్ట్ర ఏర్పాటు ఏక్‌దమ్ అభివృద్ధికి రాచబాట అయిపోతుందని విశ్వసించడానికి ఆధారాలేమీ లేవు. ఇతర రాజకీయ ప్రాకృతిక ఆర్థిక కారణాలు లేకుండా కేవలం వేర్పాటువల్లనే దేశాలు రాష్ట్రాలు బాగుపడిపోయిన దాఖలాలు ప్రపంచంలో లేవు. మూడు రాష్ట్రాల రాజకీయ అనుభవాలను శ్రీకృష్ణకమిటీ వివరంగానే ప్రస్తావించి విభజనే తారకమంత్రం కాదని తేల్చింది. మాకు విభజనే కావాలని అడగవచ్చు గాని పరిశీలనాంశాలు చెప్పడమే తప్పయినట్టు చిత్రిస్తే చెల్లుబాటు కాదు.

ఈ క్షణంలో ధరల పెరుగుదల, ఉద్యోగాల శూన్యత, ఆహార అభద్రత, అవినీతి, నేరాల విజృంభణ, సామాజిక వివక్షతలు వంటి రుగ్మతలు ఏవైతే ప్రధానంగా వేధిస్తున్నాయో వీటికి రాష్ట్ర విభజన పరిష్కారం చూపిస్తుందని చెప్పడం భ్రమలు కల్పించడమే. విభజన కన్నా విధానాల మార్పే వీటికి పరిష్కారం. అలాంటి మాటలేవీ వినిపించకుండా కేవలం సీమాంధ్ర తెలంగాణా అంటూ మాట్లాడితే సరిపోదు. అసమానతలు వివిధ స్థాయిల్లో వివిధ రూపాల్లో కొనసాగించడం దోపిడీ వ్యవస్థ లక్షణం. వాటినే ఆధారంగా చేసుకుని ప్రజల మధ్య విభజన పెట్టి రాజకీయ ప్రయోజనాలు సాధించుకోవడం పాలక వర్గ నేతల లక్షణం. ఆత్మబలి చేసుకున్న యువతను గురించి ఆవేదన చెందడంతో పాటు వారిని ఆ విధమైన పరిస్థితికి నడిపించిన భ్రమాత్మక వాదనల నిజా నిజాలు గుర్తించడం కూడా అవసరం. లేకపోతే ఇలాంటి విషాదాలు పునరావృతం కావచ్చు. అలాగే రాష్ట్ర విభజన కోసం పాద ప్రక్షాళనల వంటి పవిత్ర కార్యాలు తలపెట్టి వీర తెలంగాణా సాయుధ పోరాట వారసత్వాన్ని కించపర్చాల్సిన అవసరం అంతకన్నా వుండదు.

తెలంగాణా నేతలు లేదా సీమాంధ్ర నేతలు అందరూ చాలా కాలంగా అన్ని రకాల రాజకీయ క్రీడలలో ఆరితేరిన వారే. ముఠాలు మూటలు కట్టిన వారే. ఇందులో ఎవరు ఎక్కువ లాభపడ్డారు, ఎవరు ఎక్కువ పదవులు పొందారు అన్న దానితో ప్రజలకేమీ నిమిత్తం లేదు. నిరుద్యోగులకూ, నిష్ట దరిద్రులకూ, ఉద్యోగులకూ, సామాన్యులకూ, దళితులూ, గిరిజనుల వంటి ఉపేక్షిత వర్గాలకూ అలాంటి తేడాలేమీ వుండవు. రాష్ట్రంలోనే వెనకబడిన ప్రాంతంగా శ్రీకృష్ణకమిటీ నిర్ధారించిన రాయలసీమ నుంచి అత్యధిక కాలం ముఖ్యమంత్రులు (రాష్ట్రపతి కూడా) పాలన చేశారు. అయితే వొరిగిందేమిటట? కరీం నగరీయుడు ప్రధానిగా పూర్తి కాలం పదవి వెలగబెట్టినా తెలంగాణాకు చేసిందేమిటి? మహబూబ్‌నగర్ మహానాయకులు కేంద్రంలో వుండి ఘోరమైన వెనకబాటు నుంచి ఆదుకున్నదేమిటి? ఇందిరాగాంధీ గారే మెదక్ నుంచి ఎన్నికైనా లాభమేమిటి? కనక ఒక ప్రాంతంలో ప్రజల అభివృద్ధికి అక్కడి అధినేతల పదవీ ఫలాలకు, ధనస్వాముల సంపద కేంద్రీకరణకు ఏ సంబంధం వుండదు. ప్రాంతీయ అసమానతలను గురించి శ్రీకృష్ణకమిటీ చేసిన నిర్ధారణలు గతంలో సెస్ వంటి ఆర్థిక సంస్థలు చేసిన అధ్యయనాలకు దగ్గరగా వుండటం యాదృచ్ఛికం కాదు. ఇప్పుడు తెలంగాణా విభజనను బలపర్చే సి. హెచ్. హనుమంతరావు గారి వంటి వారు ఆ అధ్యయనంపై వెలువడిన సంపుటి సంపాదకుల్లో ఒకరు. ఇప్పుడు ఈ వాదనకు ప్రప్రధాన ప్రతినిధిగా వుండి తెలుగుదేశంపై నిరంతరం ధ్వజమెత్తే అధినాయకుడే ఒకనాడు శాసనసభలో ప్రాంతీయ రక్షణలకు కాలం చెల్లిందని రద్దు చేయాలని చంద్రబాబును వేడుకున్న చరిత్ర వుంది. అలాగే ఇప్పుడు విభజన వద్దనే వారిలో కొందరు లోగడ జై ఆంధ్ర అన్నవారే. అంతెందుకు? ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుపై హడావుడి అక్కర్లేదనే మొదట్లో చెప్పిన నీలం సంజీవరెడ్డి రాష్ట్రానికి తొలి ముఖ్యమంత్రి! కనకనే పాలక వర్గ పార్టీల నాయకులు అప్పటి తమ అవసరాలను బట్టి చేసే రాజకీయ పదజాలాల మాయాజాలంలో చిక్కుకుపోకుండా అప్రమత్తంగా వ్యవహరించవలసిన ఆగత్యం వుంటుంది. అసమానతలు అలక్ష్యాల వల్ల ఏర్పడే పరిస్థితిని స్వార్థపరులైన రాజకీయవేత్తలు ఉపయోగించుకుంటారని శ్రీకృష్ణ చేసిన హెచ్చరిక ఈ కోణంలో చాలా కీలకమైంది. ఇది ఏ ప్రాంతంపైన ఏ నాయకుని పైనా ప్రత్యేకంగా చేసిందనుకోనక్కరలేదు. ప్రభుత్వ ఉద్యోగాలే తగ్గిపోతుంటే విదిలించే కొన్నిటి కోసం జనం మధ్య మంటలు రేగకుండా జాగ్రత్త పడాలని కూడా శ్రీ కృష్ణ సరిగ్గానే చెప్పారు.

శ్రీ కృష్ణ కమిటీ నివేదిక లోటుపాట్లు ఏమైనా అంతిమ నిర్ణయం తీసుకోవలసిన కేంద్రం దాగుడు మూతలు బాధ్యతా రహితమైనవి. అది తమ అంతర్గత వ్యవహారమైనట్టు ఒకో ప్రాంతం వారిని విడిగా పిలిపించి ప్రహసనాలు నడిపించడం, మంత్రులు కూడా ప్రాంతాల వారిగా మాట్లాడ్డం ప్రజాస్వామ్య ప్రాథమిక సూత్రాలకే విరుద్ధం. ఈ వికృత విన్యాసాలన్నిటికీ తెరపడాలంటే సత్వరం నిర్ణయం అత్యావశ్యకం. జగన్ సవాలో మరొకటో సాకుగా చూపిస్తూ సాగదీయడం సర్వానర్థం. ఏ నిర్ణయం తీసుకోలేమనుకుంటే ఆ మాటైనా జనానికి చెప్పాలి తప్ప అవాంఛనీయమైన వూహాగానాలకూ, వ్యూహాలకూ అవకాశమివ్వకూడదు. అందరినీ సంప్రదించిన కమిటీ ఒక అధికారిక నివేదిక ఇచ్చిన తర్వాత కూడా ఆట ముగించకపోవడం ఆందోళనకరం. ఈ అనిశ్చితిలో మంట కాచుకునే వారి వైఖరి మరింత అభ్యంతరకరం.

('ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో)

# మానవతా వాదం, శాస్త్రీయ దృక్పథం మహారాజు కవిత్వం


డాక్టర్ దేవరాజు మహారాజు

- జి. సోమశేఖ

'గాయపడ్డ ఉదయం' (1990) కవితా సంపుటి డాక్టర్ దేవరాజు మహారాజు రచనలలో విశిష్టమైనది. దానికి తెలుగు విశ్వవిద్యాలయ ప్రధాన సాహితీ పురస్కారం 1991లో అందింది. కవులకు అక్షరాలే ముడిసరుకు. వాటి శక్తి వారికి తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదు. ఈ కవి అక్షర శక్తిని 'విశ్వ శక్తి'గా వర్ణించారు. "అక్షరం మండుతున్న ఇనుప ముక్క / నిషేధాజ్ఞల సమ్మెట పోట్లు పడుతున్న కొద్దీ / పదునెక్కుతున్న ఆయుధం /" అని అన్నారు. అక్షరాలు రాజకీయ స్వార్థ శక్తులకు లొంగవని, మానవుణ్ణి అజ్ఞానం నుండి విజ్ఞాన తీరాలకు చేర్చేవి అక్షర నౌకలేనని చెబుతూ, అక్షరం దుర్వినియోగమయితే మరో ప్రపంచ యుద్ధం తప్పదని హెచ్చరించారు. "మనో దౌర్బల్యం లోంచి పెరుగుతున్న విజ్ఞానం ప్రయోజన శూన్యమని" (అంతర్వాహిని) ఆవేదన చెందారు. సంఘంలో గురువుల గురుతర బాధ్యత గురించి, వారి నిరాడంబరత గురించి "లైట్ హౌస్" కవితలో వాస్తవాల్ని తెలియజేశారు. "అతడు కేవలం క్లాసులో ఉపన్యసించడు" అనే వాక్యం పునరావృతమవుతూ గురువుల ఘనతను వివరిస్తుంది. గురువే నమః కవిత రాజకీయ శక్తుల మధ్య గురువుల దీనస్థితిని కళ్ళకు కట్టినట్లు "ఈ చదువుకున్న గాడిదలతో / గొప్ప సర్కస్‌లు చేయించొచ్చు గదా సార్ / జీతాలొస్తాయో లేదో / వస్తే, ఎప్పుడొస్తాయో ఏమో తెలియని అయోమయంలో / ప్రతి నెలా మావి ఆమరణ నిరాహార దీక్షలే గద సార్" - అంటూ ఎంతో రమణీయంగా, నాటకీయంగా వర్ణించింది.

దేవరాజు మహారాజుకి పీడిత జనంపై, అమాయకులపై ఎంతో మమకారం ఉంది. తమ మాయాజాలంతో జనాన్ని మోసగించి, వారి కడుపులు కొట్టే నాయకులపై తీవ్రమైన కోపం వుంది. ఆడ అభిమానుల శరీరాలను కోరుకునే క్షుద్ర రచయితలపై క్రోధం కూడా ఉంది. (క్షుద్ర సంస్కృతి) తెలంగాణా జనజీవితం నేపథ్యంగా రచించిన 'హత్య' కవితలో దొరల క్రూరకృత్యాలకూ, వర్షానికీ పోలిక ఉంది. దోపిడీని హింసను కొత్త తరహాలో వర్ణించడం జరిగింది.

"ముడుచుకు కూచున్న బక్క ప్రాణి
వీపు మీద బలమైన
చినుకుల చెప్పుల దెబ్బలు
వంటి నిండా దెబ్బల చారలు" - అని అమానుష చర్యలకు బలైపోయిన నిరుపేదను, వరదలో కొట్టుకుపోయే శవంతో పోల్చడం కవి భావం.

నీ బతుకు మీద నవ్వేందుకు
అఖిల భారత హాస్య సమ్మేళనం ఏర్పాటవుతుంది" - అని అంటారు. 'సజీవ రొబోట్'గా మారిన మనిషి మీద ఎంతగానో జాలిపడతారు. చివరగా 'గాయపడ్డ ఉదయం' కవితలో రాజకీయ కుట్రలో పడి పతనమవుతున్న భారతదేశ దైనందిన చరిత్ర చిత్రితమైంది. ఇక్కడ కవి హృదయమే కాదు, ఉదయం కూడా గాయపడిందన్న మాట. ఉదయమే గాయపడి ఉదయిస్తోందంటే... ఇక సమాజ స్వరూపం ఎలా ఉండబోతుందో ఊహించుకోవలసిన బాధ్యత ప్రజలదేనని కవి చెబుతున్నాడన్న మాట!

"న్యూస్ ప్రింట్ మీద కనిపించే ప్రతి అక్షరమూ
పోలీస్ ఫిరంగిలో చచ్చి, వంకర్లు తిరిగిన గిరిజనుడి
శవం లాగా కనిపిస్తుంది...
కిటికీ ముందు నిల్చుంటే
యాసిడ్‌తో కళ్ళు కాల్చిన ముఖంలాగా
మిథైల్ ఐసోసయనేట్ గ్యాస్ లీకైన నగరంలో
ఉదయం ప్రశాంతంగా ఉంది" అంటారు.

మహారాజు కవితా శైలి చాలా సరళమైంది. ఎంత స్పష్టత ఉందో అంత గాఢత వుంది. మెత్తని విసుర్లతో పాటు పదునైన వ్యంగ్యం ఉంది. విషయ వైవిధ్యం, వాస్తవికత పాఠకులను ఆకట్టుకుంటాయి. "అయ్యా! ఇది కవిత్వం కాదు - యథార్థం" (ప్రెస్ రిపోర్టు) అని అన్నప్పటికీ, యథార్థం కవితామయమై పాఠకులను కదిలిస్తుంది. ఆలోచనలు రేకెత్తిస్తుంది. బయాలజీ ప్రొఫెసరైన మహారాజు కవితలో శాస్త్రీయ దృక్పథం, మానవతా వాదం, కళాత్మక దృష్టి సమ్మిళితమై ఆధునిక తెలుగు వచన కవితకు కొంత బలాన్ని, కొత్తదనాన్ని సంతరించి పెట్టాయి. ఈయన తన ఆత్మానుభూతుల వద్ద గిరిగీసుకుని కూర్చోలేదు. సమాజంలో విలువలు క్షీణిస్తున్న దశలో వాటిని గూర్చి ఎలుగెత్తి చెప్పడంలో తనకు తానే బాధ్యత స్వీకరిస్తారు.

తెలంగాణా మాండలికంలో కవిత్వం వినిపిస్తూ తెలుగు సాహితీ రంగంలోకి ప్రవేశించిన దేవరాజు మహారాజు కవిత్వం సామాన్యుడికి కూడా అర్థం కావాలని కోరుకుంటారు. అందుకే సంక్లిష్టమైన భావాలను సైతం సులభంగా వ్యక్తీకరించడానికి ప్రయత్నిస్తారు. ఒక కవిత్వమే కాదు, ఇతర సాహితీ ప్రక్రియలన్నింటా కృషి చేస్తూ, ఎంతో ఆత్మవిశ్వాసంతో సమకాలీన తెలుగు సాహిత్య రంగంలో ఆయన తన బహుముఖ ప్రజ్ఞను కనబరుస్తున్నారు. డాక్టర్ దేవరాజు మహారాజుది ఎంతో బాధ్యత గల సాహితీ వ్యక్తిత్వం. ఆయన కృషి మరింత ప్రయోజనకరంగా సాగాలని సాహితీ ప్రియుల ఆకాంక్ష. సాహిత్య విలువలు నిలబడాలన్నదే బలమైన కాంక్ష!!

# ఆలోచనలను రగిల్చే అనల సమీరం

- వీరప్రసాద్




అక్షరాలు అలవోకగా ఆలోచనలు రగిలించాలి. వాక్యాలు పాఠకుడ్ని ఆకర్షించి మనిషికి శత్రువైన వాడి జాడను చూపించాలి. తన కవితల ప్రపంచంలోకి లాక్కుని మెదడుకి ప్రేరణను, హృదయానికి ఉత్తేజాన్ని అందించి వదలాలి. ఈ పని చేయడానికి చాలా కసరత్తు చేయాలి. తన సర్వశక్తిని దట్టించి కవిత్వాన్ని పండించాలి. కవితా నిర్మాణంలో తపనతో మమేకం కావాలి. అలా అక్షరాలకు శక్తిని, ఉద్వేగ పరిమళాన్ని అద్దిన కవి పాఠకుడ్ని స్నేహితుడ్ని చేసుకుంటాడు. ఇవి సాధించడానికి వర్తమాన సామాజిక నేపథ్యం కవికి ఆలంబనగా ఉంటుంది. ఖమ్మం జిల్లా నేలకొండపల్లి గ్రామానికి చెందిన కవి పోతగాని ఆ దిశగా చేస్తున్న కృషిని 'అనల సమీరం' పట్టి చూపిస్తుంది. గతంలో 'ప్రవాహ స్పర్శ'తో పాఠకులను పలకరించిన పోతగాని 'అనల సమీరం' తో కవిత్వ పథికుడిగా తీవ్రమైన కంఠస్వరంతో మనముందుకు వస్తున్నాడు.

బలమైన అభివ్యక్తి, కదిలించే ఉద్వేగంతో పోతగాని కవిత్వ పాఠకుడ్ని ఆకర్షిస్తాడు. 'వాడు- అత్యాశల మనోమైదానాలను దున్ని/ డాలర్‌విత్తులు నాటే కార్పోరేట్ ఖామందు/..../అణుబంధాలను శ్వాసించే ఇనుపగోళ్ళ రాబందు"/...../అక్కరకు రాని సంతకాలను ధిక్కరించే/ ఎరుపెక్కిన నినాదాల హెచ్చరిక!' (అక్కరకు రాని సంతకం) అణు ఒప్పందం పేరుతో మన దేశాన్ని సామ్రాజ్యవాదం తన కబంధ హస్తాలలో ఇముడ్చుకుంటున్న తీరును బలంగా నిరసిస్తాడు. ఈ కవితా సంపుటిలో అడుగడుగునా సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించిన కవితాక్షరాలు ఎదురవుతుంటాయి. -'గ్లోబల్ వేటగాడు చల్లిన ఆశల నూకలకై ఎగబడి/వాడు పన్నిన విషజాలంలో చిక్కిన/ అలజడి పావురాలిప్పుడు/ ఏకమై ఎగరాల్సి ఉంది!/బిగిసే ఉచ్చుల్ని ఛేదించేందుకు సమరానికి/ సిద్ధం కావాల్సివుంది!!' మనదేశంలో అమలవుతున్న ప్రపంచీకరణ విధానాలు ప్రజలను భ్రమలకు గురిచేసాయి. మార్కెట్ కేంద్రంగా సాగే ఈ విధానాలు మనిషిని వినియోగదారుడిగా మార్చేస్తున్నాయి. ఫలితంగా మానవ విలువల విధ్వంసం జరిగి సౌఖ్యం, స్వార్థం చుట్టూ తిరిగే జీవిగా మనిషి మారిపోతున్నాడు. వీటన్నింటికీ కారణం- 'ప్రలోభ సంగీతంతో జోకొట్టి/నిద్రలోకి జారుతున్న నెత్తుట్లోకి/ డాలర్ వైరసుల్ని సుతిమెత్తగా చొప్పిస్తూ/శ్రమైక స్వప్నాలను భగ్నం చేసే గ్లోబల్‌జోరీగ్గె/..../(ఉనికి తెలియని ఊడలు) అంటూ అసలు విషయాన్ని అలవోకగా కవిత్వంగా మారుస్తాడు. మార్కెట్ వ్యవస్థ నైజాన్ని బహిర్గతం చేయడంలో పోతగాని సంకల్పాన్ని, అభివ్యక్తి ప్రతిభను అభినందించకుండా ఉండలేం. ఈ రోజున భూమండలం మొత్తాన్ని ఆక్టోపస్‌లా కమ్మేసిన అమెరికన్ ప్రపంచీకరణను నిలువరించడానికి పెద్ద యుద్ధమే చేయాల్సి వుంది.

సమాజంలో అపసవ్యతతో కూడుకున్న ప్రతీ అంశమూ పోతగానికి కవితా వస్తువయ్యింది. కులవృత్తులు నాశనమవ్వడాన్ని వర్గదృష్టితో విశ్లేషిస్తూ మౌలిక అవగాహనను వ్యక్తీకరిస్తాడు-" చెప్పులు కుట్టిన చేతులిరిగి చానాళ్ళయినా/ తోళ్ళ రోశయ్య ఇప్పటికీ చర్మకారుడే!'/ బాగా బతికినోడయినా సంభావన కరువై/ మెతుకు వేటలో పండిపోయిన/ బాపన కోటయ్యదింకా అగ్రవర్ణమే!' (ఉనికి తెలియని ఊడలు). ఆధునిక కాలంలో సాహిత్యరంగంపై అస్తిత్వవాదాల ప్రభావం తీవ్రంగా పడింది. బుద్ధిజీవులైన రచయితలను ఈ వాదనలు వర్గదోపిడిని లక్ష్యంగా చేసుకోకుండా పక్కదారి పట్టించడానికి, పేద వర్గాలను ఐనైక్యత వైపు నెట్టివేయడానికి కారణమయ్యాయి. ఆ వాదనల్లోని సహేతుకతల్ని పట్టించుకుంటూనే అసలు లక్ష్యాన్ని ఛేదిస్తూ కొద్ది మందే ముందుకు సాగారు. అలాంటి వారిలో పోతగానిని మనం స్పష్టంగా గుర్తిస్తాం.

సమాజాన్ని మౌలికంగా అర్థం చేసుకున్న కవి తన ప్రయాణాన్ని స్పష్టంగా నిర్దేశించుకుంటాడు. సమాజంలోని అసమానతలకు, అవమానాలకు కారణమైన నేపథ్యాన్ని కవిత్వీకరిస్తూ పరిష్కారాలకు మూలాలను వెదకమంటాడు. అప్పుడే కవి దృష్టి స్పష్టమవుతుంది -'ఆమె చరిత్రపుటల్లో వేలానికి పెట్టిన/ జీవమున్న వస్తువుగానే పరిగణించబడింది/బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం/ అవస్థలేవైనా అజమాయిషీ వాడిదే అయింది' (కదన కా(హ)ళి). పురుషాధిక్య సమాజంలో 'వాడిదే' అధికారం. 'వాడు' కేంద్రంగా నిర్మించబడిన సమాజంలో 'ఆమె' వస్తువుగానే కొనసాగింది. ఈ అసహజ రూపాన్ని ఆవిష్కరిస్తూ 'చరిత్రపుటల' లోతులను తడమడంలో కవి దృష్టిని పరిశీలించాలి. అక్కడ పురుషుడ్ని'వాడు' అని సంబోధిస్తూనే చరిత్రకు ముడిపెడుతూ వ్యక్తిని మాత్రమే కాకుండా వ్యవస్థను కూడా కారణంగా చూపిస్తాడు.

విశృంఖల వ్యాపార వ్యవస్థలో వ్యక్తులే అరాచక శక్తులుగా మారతారు. అమానవీయ చర్యలకు ఒడిగడతారు. గిరిజన మహిళలపై జరిగిన అమానుష చర్యను -'రక్షణ ముసుగులో కీచక సంచారం!/ అడవిలో అహల్యపై/ మూకుమ్మడి అత్యాచారం/మైలపడిన ఆచారానికి/

అభ్యంగన స్నానం/..../కలతపడిన హృదయం నిండా/ అవమాన మేఘాలు అలముకుంటాయి/ఆక్రోశించే ఆవేదనలన్నీ/గతం సమాధుల చుట్టూ/ రహస్యాల్ని ఛేదించే/మిణుగురులై పరిభ్రమిస్తాయి/అసలు నిజాల ఆవిష్కరణకై/ అనునిత్యం అరాటిస్తాయి' (ఆధునిక అహల్యలు) అంటూ తన వేదనను కవిత్వంలోకి అనువదిస్తాడు. ఈ అమానుషాల రహస్యాలను గతం సమాధులపై వెలుగుతున్న మిణుగురులతో అన్వేషింపచేస్తాడు. కేవలం స్పందనను వ్యక్తీకరించడంగా గాక ఈ సంఘటనలను ఆలంబనగా చేసుకుని సామాజిక మార్పుకు పునరంకితం అవ్వాలనే సంకల్పాన్ని అంతర్లీనంగా వినిపిస్తాడు. కవి భావాల్ని అక్షరాలు శక్తివంతంగా చాటుతాయి. - 'జీవిక సందిగ్ధంలో అక్షయ చైతన్యం నేను/ పూనిక సందర్భంలో చెదరని సంకల్పం నేను/ పెనవేసిన బంధనాల పీడన వదిలిస్తాను/ అక్షర విత్తులు నాటి ఉద్యమాలు మొలిపిస్తాను/..../నా ఉనికే నవత్వం/ నా ఊపిరి కవిత్వం' (అనల సమీరం) తన ఆకాంక్షతో, తన కవిత్వంతో ఎంతగా పెనవేసుకుపోయాడో ఈ వాక్యాలు చూపిస్తాయి. నిరంతరం అక్షరాలకు శక్తిని చేకూర్చాలని కవి చేసే ప్రయత్నాలు మన దృష్టికి రాకుండా ఉండవు.

చెప్పుకోవడానికి కావలసినన్ని శక్తివంతమైన చరణాలు ఈ 'అనల సమీరం'లో ఉన్నాయి. అనివార్యమైన వృద్ధాప్యాన్ని పోతగాని కవిత్వం చేసిన తీరు పాఠకుడిని కదిలిస్తుంది. - 'మరపురాని త్యాగమేదో/ నిరంతర జ్ఞాపకమై వెంటాడుతుంది/ నిద్రాణమైన మెదడు సంద్రంలో/ మెలకువ కెరటాలై పల్లవిస్తుంది/ కూరుకుపోయిన కనుగూళ్ళ చుట్టూ/ వలయాలై పేరుకున్న అనుభవాల దొంతరలు/వృద్ధాప్య శిశిరంలో/ ఒక్కొక్కటిగా కూలిపడుతున్న/ సప్తవర్ణ స్వప్న శకలాలు/ తెరుచుకున్న గాయాల గ్రంథం నిండా/ భారమైన భావాలను భరించలేని/ వాక్యాల అక్షరఘోష!/ ఇప్పుడామె-/ పేగుబంధం విడిచిన ఒంటరి కుబుసం!/ పట్టణాల బస్టాండ్లలోకి/నిర్దయగా గెంటేసిన అనామక బ్రతుకుచిత్రం!!/..../ఆకలి కడుపుల్లో అన్నమై పూసిన అమ్మతనం/ మెతుకు యాచనకై జోలెతెరిచిన దృశ్యమౌతుంది'/...../పేవ్‌మెంటుపై మంచుదుప్పట్లో/ ముడుచుకున్న దేహం/ ప్రశ్నార్థక చిహ్నమై, మానవత్వాన్ని పరిహసిస్తుంది' (ఒక అనామక బ్రతుకుచిత్రం). పేవ్‌మెంట్ మీద మంచులో వణుకుతూ ముడుచుకుపోయిన ఓ వృద్ధ శరీరంతో కూడిన ఓ దృశ్యాన్ని ఈ కవిత మనకు రూపుకట్టిస్తుంది. వృద్ధులకు, మహిళలకూ, పిల్లలకూ తగిన రక్షణ చేకూర్చలేని ఆధునిక నాగరిక సమాజ చిత్రాన్ని పోతగాని తన కవిత్వంతో కళ్ళకు కట్టిస్తాడు. ఓ కొత్త సమాజాన్ని నిర్మించడానికి పూనిక పట్టండి అంటూ ప్రతీ అక్షరాన్నీ కవిత్వం చేసి మన మీదకు విసురుతాడు- 'మానుషత్వానికి మెలకువ అవసరం/ మైకం ముసరని వేకువ కోసం జనం పూనిక అనివార్యం!' (మైకం ముసరని వేకువ కోసం). పోతగాని కవిత్వంలో రాజీపడని కవి గొంతు బలంగా వినపడుతూ పాఠకుడ్ని వెంటాడుతుంది. తను చెప్పదలుచుకున్న అంశాన్ని దృశ్యంగా మార్చి దానికి ఉద్వేగ సంగీతాన్ని సమకూర్చుతాడు.

కవి నేపథ్యాన్ని పట్టించే కవితలు కూడా తారసపడతాయి. - 'ఇక్కడే ఈ శిథిలమైన గోడల మధ్య/ఈ తుమ్మలు మొలచిన పాటిమట్టి పొరలకింద/ వలస పిట్టల బ్రతుకు చిత్రాలు/ శిలాజాలై దొరుకుతుంటాయి/ అనాథలై అలమటించే నోళ్ళు తెరచిన రోళ్ళు/ కీళ్ళు అరిగిన గిలకబావి ముగుపట్టిన జలగర్భాలు/మరెన్నో తవ్వుతున్న కొద్దీ తొంగిచూచే/ మరుగు పడిన జ్ఞాపకాల ఆనవాళ్ళు' /..../ 'మరుపురాని గతంలోకి గాలం వేస్తే/ గాయపడిన జ్ఞాపకాల గుర్తులెన్నో.../ ఒక్కొక్కటిగా వరుస కడుతుంటాయి' (ఊరొలస బోయింది). ఇది కేవలం తన బాల్యంలో పెరిగిన వాతావరణాన్ని పరవశంతో పలవరించడ మే కాదు. నోళ్ళు తెరిచిన రోళ్ళు, అరిగిన గిలకబావి, వలసపిట్టల బ్రతుకు చిత్రాలను చెప్తాడు. జీవం కోల్పోతున్న మానవ ప్రపంచపు ప్రతీకలను రక్షించడానికి సంకల్పం చెప్పుకోమంటాడు. తన బాల్యంలోని అనుభూతుల్ని మనోహరంగా పాఠకులకు గుర్తుచేస్తాడు పోతగాని - 'సిగమోరలతో సింగారించి/ మెడకు మువ్వల పట్టెళ్ళు గట్టి/ వీపు చరిచి పురమాయిస్తే/ కాడి మెడకెత్తుకున్న మనసు/ తెలిసిన మూగ జీవులు/ కంచుగంటల మోతలకు/ లయబద్ధంగా పరవళ్ళు తొక్కుతుంటే/ వయ్యారాలుపోయే వాటి మూపురాల సోయగాలు/ మనసును పరవశింపజేసేవి/ ధాన్యం బోరేలకెత్తి బండితొట్టిలోకెక్కి/ నూలుపూల చర్నాకోల చేతబడితే/ యుద్ధక్షేత్రం నుండి విజయగర్వంతో/ బయలుదేరిన రథాన్ని నడుపుతున్నట్లుండేది!/ ధాన్యం రాసులు పోసిన వసారా/ సిరులు కొలువైన కోవెలగా పసిడిరంగులతో ప్రకాశించేది!/ చెమట చుక్కల శ్రమ ఫలాన్ని/ కుండలతో కొలుస్తుంటే వాడవాడంతా/ వేములవాడ రాజన్న మనువునాటి/ సంబరాల సందడ్ని తలపించేది'(వేయని విత్తనాలు మొలుస్తున్నప్పుడు)

చరిత్రను తడుముతూ కవిత్వం రాసే పోతగాని, చరిత్రను వక్రీకరించే వారి పట్ల కఠినంగా స్పందిస్తాడు-'మరణం తరువాత/ మంచిని గాలించడం మామూలే!/ మరి నిజం తెలిసితెలిసి/ నేతిబీరకాయలో నెయ్యినిచూపే ప్రయత్నమెందుకు?/ వెలుగన్నదేలేని చరిత్ర బొరియల్లోకి/ చొరబడటమే పెద్ద సాహసం!/ నీచమైన గతాన్నెంతగా తోడిపోసినా/ గాయపడిన జ్ఞాపకాలన్నీ/ రక్తసిక్తమై వెక్కిరిస్తూనే ఉంటాయి/ శవాల నెగళ్ళతో చలికాగిన ముసలినక్క/ నమిలి ఊసిన ఎముకల గూళ్ళు/ గావుపట్టి జీవాల వెచ్చనినెత్తురు పీల్చిన మృగం/ మూతి తుడుచుకున్న ఆనవాళ్ళు'/.../దోచిన ధాన్యం దాచుకున్న గరిసెలు/కళాత్మక నిర్మాణాలై కనపడతాయా?/ ఉరితీసిన వీరుల శవాలు వేలాడిన కోటగుమ్మాలు/ అపురూప కట్టడాలై కనువిందు చేస్తాయా?/ పేదజనం మెడలు విరిచి వెలుగొందిన గుడిబండలు/ అందమైన అభరణాలై అబ్బుర పరుస్తాయా?/తోడేళ్ళ వారసత్వాన్ని తోడుకుంటున్న నాలుకే/ నియంతకైనా నీరాజనాలర్పిస్తుంది/ ఊసరవెల్లి మాటల వైఖరే/ నైజానికి రూపమిచ్చి నిజరూపం బయటపెడుతుంది' (నిజాన్ని విడిచిన నైజం వెనుక). తమ అవసరాల కోసం చరిత్రను సైతం తలకిందులు చేయడానికి ప్రయత్నిస్తున్న శక్తులను ఏ మాత్రం సహించనితనం ఈ చరణాల్లో వ్యక్తమవుతుంది.

ఆధునికానంతర వాదంతో సౌకర్యవంతంగా సాగుతూ ప్రజా ఉద్యమాలను తప్పుపట్టే వారిని తూర్పారబట్టడంలో కూడా పోతగాని ముందున్నాడు. - 'గోతికాడ నక్కల ఊలలు/ ఎముకలెత్తుకు పారిపోతాయి!!/ ముసిరే ముప్పులనెదిరిస్తూ/ అనుక్షణం మరణించే ముందు వరుస నడకల్ని/ శంకించడం నీ తరమా?' (చదివిన కబోది!). అంటాడు.

సమాజ వికాసానికి ఆటంకం కలిగించే అంశాలు పోతగాని కవితా వస్తువులు. ఎన్నుకున్న కవితా ఇతివృత్తం ఏదైనా కవిత్వం పండించడంలో సునాయాసంగా విజయం సాధించడం పోతగాని ప్రత్యేకత. ఈ కవిత్వం చదివితే సమాజాన్ని లోతుగా పరిశీలిస్తున్న కవి దర్శనమిస్తాడు. మంచి చెడుల తారతమ్యాల్ని సహేతుకంగా తన కవిత్వం ద్వారా ఆవిష్కరిస్తాడు. నేడు వస్తున్న కవిత్వంతో పోల్చినప్పుడు పోతగాని కవిత్వ చిక్కదనాన్ని సందేహించనక్కర్లేదు. పోతగాని కవితా శక్తి తో పోల్చినప్పుడు ముందు ముందు మరింత చిక్కదనం సాధిస్తాడని ఆశించాలి. ఈ కవితాక్షర యాత్ర నిరాటంకంగా కొనసాగించాలని ఈ కవిని కోరాల్సిందే.

# కొత్త పుస్తకాలు

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజకీయాలు (1919-2010)




- ఆచార్య మారంరాజు సత్యనారాయణరావు

వెల : రూ. 125/- పేజీలు : 316

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ 040-27608107

ఆంధ్రప్రదేశ్ రాజకీయాలకు సంబంధించిన పుస్తకాలు తక్కువగానే అందుబాటులో వున్న నేపథ్యంలో ఎం. సత్యనారాయణరావు గారు రచించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజకీయాలు అన్న పుస్తకాన్ని పునర్ముద్రిస్తున్నాం. 1992లో మొదటిసారి వెలువడిన ఈ పుస్తకంలో మామూలుగా ప్రస్తావనకు రాని కొన్ని ప్రత్యేకాంశాలు వున్న విషయం పాఠకులు గమనించగలుగుతారు. ఇప్పుడు చాలా ఎక్కువగా చర్చకు వస్తున్న కొన్ని సమస్యల పూర్వాపరాలు, మూలకారణాలు, మలుపులూ కూడా తెలుస్తాయి.

- ప్రచురణకర్తలు

## పణ విపణి (గేయ కావ్యము)



- నళినీ కుమార్

వెల : రూ. 100/- పేజీలు : 151

ప్రతులకు : 94402 48778

నళినీకుమార్ ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక విశిష్ట విస్మృత కవి, అతడు శ్రీశ్రీ మహాప్రస్థానం తొలి ముద్రాపకుడుగా సాహితీ ప్రపంచంలో కొందరికి తెలిసి వుండవచ్చు. 1940 నాటికే అచ్చు కావలసిన మహాప్రస్థానం 1950 నాటికైనా వెలుగు చూడటం నళినీకుమార్ సాహసం వల్లనే సాధ్యమైంది. ఆ విధంగా ఒక మహాకవి కవితా కాంతిని, అభ్యుదయ దర్శనాన్ని లోకానికి చేరువ చేసినవాడు నళినీకుమార్. అదే క్రమంలో తెలుగునాట ప్రజా సాహిత్యోద్యమాలకు పరోక్షంగా దోహదం చేసిన ప్రత్యేకత నళినీకుమార్‌దే.

- పెనుగొండ లక్ష్మీనారాయణ

## కొన్ని రంగులు - ఒక పద్యం




- జి. వెంకటకృష్ణ

వెల : 30/- పేజీలు : 144

ప్రతులకు : 8985034894

వెంకటకృష్ణ కథనీ, కవిత్వాన్నీ సమతూకంలో నడిపిస్తున్నాడనిపిస్తుంది. దేన్ని ఎత్తుకున్నప్పుడు దానికి సంబంధించిన అన్ని మెలకువల్ని అతను మర్చిపోలేదు. చాలా మంచి కథలూ రాశాడు. కవిత్వం గురించి చెప్పాల్సిన పని లేదు. ఒక సమతూకం అన్నింటా కన్పడుతుంది. వెంకటకృష్ణ కవిగా గొప్పవాడా, కథకుడుగా గొప్పవాడా అంటే చెప్పడం కష్టం. రెంటినీ అద్భుతంగా హ్యాండిల్ చేస్తున్నాడంటా. కథకుడి ప్రభావం కవి మీద వుందా, కవి ప్రభావం కథకుడి మీద వుందా అంటే అవి పరస్పర పూరకాలు, ప్రేరకాలు, పరస్పర సంపుష్టికారకాలు.

- శివారెడ్డి

## టాల్‌స్టాయ్ సాహిత్య పరిచయ వ్యాసాలు




- ఎస్.వి.ఎస్. నాగభూషణాచార్యులు

వెల : రూ. 30/- పేజీలు : 112

ప్రతులకు : 99511 816021

వర్తమాన ప్రపంచంలో అనేక సంక్లిష్ట వైరుధ్యాల మయంగా వున్న జీవన బీభత్సాన్ని - సౌందర్యాన్ని వాస్తవికంగా చిత్రీకరించాల్సిన సాహిత్యకారులకు టాల్‌స్టాయ్ రచనలు నేటికీ గొప్ప మార్గదర్శకంగా వుంటాయి. ప్రేరణ నిస్తాయి. టాల్‌స్టాయ్ గతించి నూరేళ్ళయినా ఆయన అందించిన సాహిత్య వాస్తవికత, కళాభినివేశం, వ్యక్తిగత నిర్భయత్వం, జీవితం పట్ల నిజాయితీ మనం అందిపుచ్చుకోవాల్సిన సాంస్కృతిక విలువగా నేటికీ సజీవంగా వుంటాయి. ఒక గొప్ప కళాకారుని యొక్క మహోన్నత జీవన సాఫల్యం యిక్కడే వుంది.

- దివికుమార్

## చుక్కలు




- తంగిరాల చక్రవర్తి

వెల : రూ. 50/- పేజీలు : 51

ప్రతులకు : 040-27533177

"చుక్కలు" నేను సృష్టించిన నూతన సాహితీ ప్రక్రియ. ఈ ప్రక్రియలో ఆకర్షించబడి కొందరు రచయితలు, విశ్వసాహితీ సభ్యులు తమ చుక్కల శతకాలు రూపొందించారు. ఇవి పరిశీలించి తంగిరాల చక్రవర్తి విశ్లేషణ వ్యాసాలు రాశారు.

ఏ సాహితీ ప్రక్రియ అయినా, కొత్త ప్రయోగమైనా, రచయితలు, పాఠకులు స్పందిస్తే ఆ రచనలకు విలువ వస్తుంది. అలా సరిగా స్పందించడానికి ఇటువంటి విశ్లేషణ అంశాలు అవసరం.

- డా॥ పోతుకూచి సాంబశివరావు

## అమెరికా! ఓ అమెరికా!




- అచార్య మసన చెన్నప్ప

వెల : 60/- పేజీలు : 96

ప్రతులకు : 040-27201007

అమెరికా స్వర్గంలా ఉందంటాడు చెన్నప్ప ఓ చోట. నిజమే. అక్కడ పరిపాలన (గవర్నెన్స్) కూడా అమోఘం. అట్లాంటి అమెరికా విదేశాంగ విధానం మాత్రం లోపభూయిష్టం. ఇతరులపైకి కాలుదువ్వే తత్వం దానిది. "భద్రత" నిజమే కాని తన విధానాల వల్ల తనకే భద్రత కరువైంది. వరల్డ్ ట్రేడ్ సెంటర్ పైన విధ్వంసం జరిగినప్పుడు నేను ఆ పరిసరాల్లోనే (నువర్క్) వున్నాను.

ఈ గ్రంథం ఒకరకంగా 'అమెరికా దర్శనం' అని చెప్పొచ్చు. చెన్నప్ప అమాయకత్వం, భోళాతనం, పసితనంలోని నిర్మలత్వం, కొండొకచో గడుసుదనం అన్నీ కలబోసినట్టుగా ప్రతిఫలిస్తాయి.

- డా॥ ఎన్. గోపి

# కొత్త పుస్తకాలు



**అక్షరం** (కవితా సంపుటి)
**సాక్షిగా...**
**- నాగెల్లి ప్రభాకర్**
**వెల : రూ. 25/- పేజీలు : 56**
**ప్రతులకు : 96764 06032**

ప్రభాకర్ రచనలు చూస్తే ఎంతో అనుభవం కలిగిన గొప్ప రచయిత అనిపిస్తుంది. కాని ప్రభాకర్‌ను చూస్తే ఇతనేనా ఈ రచనలు చేసింది? అని ఆశ్చర్యపడతాము. తక్కువ మాట్లాడతాడు, ఎక్కువగా రాస్తాడు. ఎంతో వినయం, క్రమశిక్షణ, మర్యాద అతనిలో ఉట్టిపడతాయి. ప్రభాకర్ రచనల్లో నా జీవితం కనబడుతుంది. కాదు, మా వాళ్ళ జీవితాలు కనబడుతున్నాయి.

**- బి. బిక్షమయ్య**



**విపుల**
**- డా॥ విప్లవ్‌దత్ శుక్లా**
**వెల : 40/- పేజీలు : 80**
**ప్రతులకు : 90002 74474**

బలమైన భావాలు సమాజంలో వ్యాప్తి పొందినప్పుడే అది ఉద్యమ రూపం పొందుతుంది. ఆ బలం లేకపోతే వ్యక్తి ఉద్యమశీలంగా ఎదగలేడు. అందుకే బలమైన భావ ప్రచారం ఎప్పుడూ అవసరం. ఆ అవసరాన్ని తీర్చడంలో కవిత్వానికి ఉదాత్తమైన స్థానం ఉంది.

విప్లవ్‌దత్ శుక్లా సామాజిక, సామ్యవాద చైతన్యంతోనూ, ప్రగతిశీల భావాలతోనూ, వ్యక్తినీ, సమాజాన్నీ కూడా దృష్టిలో పెట్టుకుని ఈ మినీ కవితలు రాశాడు.

**- అద్దేపల్లి రామమోహనరావు**



**గమనం** (కథల సంపుటి)
**- సత్యభాస్కర్**
**వెల : రూ. 75/- పేజీలు : 127**
**ప్రతులకు : 9848391638**

ఈ సంకలనంలో ఎక్కువ భాగం కార్మిక లోకంలో ముద్రితమైనవే అయినా అన్నింటిని కలిపి ఒకేసారి (మరోసారి) చదివేనరికి గుండెను ఎవరో పిండినట్లయింది. రచయిత ఒక ప్రభుత్వ రంగ పరిశ్రమలో పని చేస్తున్నందున ఫ్యాక్టరీలు, అక్కడి వాతావరణం, 'పెద్ద సార్లు' వారి లీలలు, సూపర్‌వైజర్ల 'సర్వేయలెన్స్'లు, యూనియన్లు, ఎన్నికలు మొదలైనవన్నీ ఈ కథల్లో పుష్కలంగా వెదజల్లబడి వున్నాయి. సారీ! వాటి చుట్టూనే ఈ కథలల్లబడ్డాయి. మరోలా చెప్పాలంటే (ఓ రెండు కథలు మినహా) ఈ కథల్లోని పాత్రలన్నీ రోజు మన చుట్టూ కదలాడేవే!

**- ఆర్. సుధాభాస్కర్**



**దుఃఖాంతి**
**- బడుగు భాస్కర్ జోగేష్**
**వెల : రూ. 50/- పేజీలు : 82**
**ప్రతులకు : 9866602325**

నాలుగు కవితలు చదివాక చూడండి ఇతనిలోని కరుణగట్టిన జ్ఞానబౌద్ధుడ్ని, ఒక అస్తిత్వవాదిని, మరొక నాస్తికవాదిని. ఇతని కవిత్వం అంతా మీరు మెచ్చుకునే వినూత్నమైనదేమీ కాదు కానీ ఇతను కొత్త, ఇతని గొంతు కొత్తది మనకు.

అలా నిదురిస్తున్నప్పుడు మేల్కొల్పేవాడు కావాలి. కవిత్వం ఏదీ బోధించదు. బాధించి వదులుతుంది. మరోసారి లేలెమ్మంటుంది. లేచినవాడు మేల్కొన్నవాడు దురదృష్టజీవి. యావజ్జీవితమూ జోగేష్‌లాగే దుఃఖపరం పరాన్వితమే.

**- సీతారాం**



**అక్షర సౌజన్యం** (కవితా సంపుటి)
**- రేగులపాటి కిషన్‌రావు**
**వెల : రూ. 70/- పేజీలు : 96**
**ప్రతులకు : 9849246980**

అక్షరాలను అర్ధవంతంగా భావయుక్తంగా కూర్చినప్పుడు చక్కని ఫలితాలనందించే సాహిత్య మవుతుంది. రంగురంగుల పరిమళించు పుష్పాలను దారంతో ఒక ఆధారంతో కళాత్మకంగా కూర్చినప్పుడు అది ఒక సొగసులొలికే మాలగా రూపొందుతుంది. స్వరాలను లయాత్మకంగా కూర్చినప్పుడు అది వినసొంపగు సంగీతమవుతుంది.

**- ఆకాశిక్**



**ముంబయి (చాట్) భేల్**
**- అంబల్ల జనార్దన్**
**వెల : రూ. 60/- పేజీలు : 67**
**ప్రతులకు : 09619733225**

ఈ సంపుటిలో నేను చిన్నప్పటి నుంచి రాసిన పాటలు, గేయాలు, కవితలు అన్నీ ఉన్నాయి. భేల్ అంటేనే కలగాపులగం. భేల్ చాట్‌లోని వివిధ రకాల దినుసుల్లానే నా ఈ భేల్ మిమ్మల్ని అలరిస్తుందనే నమ్మకం నాకుంది. అలా అని మిమ్మల్ని మొహమాట పెడుతున్నాననుకుంటారేమో? ఎంతమాత్రం కాదు. కాకి పిల్ల కాకికి ముద్దు గదా!

**- అంబల్ల జనార్దన్**

## భరించాల్సిందే

- సిరిసిల్లా గఫూర్ శిక్షక్



ఇక్కడ
నడక అడుగులు
తడబడనివ్వక
సాగాల్సిందే
ప్రాణాలన్నీ ఆహుతయ్యి
శవాల కంపు రాజేసినా
కన్నులను అదుపులో ఉంచాల్సిందే
మమత, మనసుల ముడులు విప్పాల్సిందే
పెల్లుబికిన కన్నీటి చుక్కల్లో
మానవతను అమ్మిన బాధను
పుండైన గాయాల రోదను
అనాథల ఆక్రందన వ్యధను
చూడాల్సిందే......
బతుకును ప్రశ్నగ మార్చిన
అవినీతి భుజంగం బుసను
దుండగుల కబంధ హస్తం
మాత గర్భాన్ని చీలుస్తున్న
విధ్వంసం అణువుల భారం
గుండెలపై మోయాల్సిందే.....
బద్దలయ్యే ప్రాణాలను
మాంసపు ముద్దలయ్యే దేహాలను
తెగిపడిన అవయవాలను
మిన్నంటే రోదనల ఆర్తనాదాలను
కారుతున్న కన్నీటితో చూడాల్సిందే
వ్యాధుల రక్కసి కబళిస్తుంటే
మాత గుండెలపై మట్టిబంధం
ప్రశ్నగా నిలుస్తుంటే
మానవత్వం మార్గాన్ని మర్చిపోయి
మారణహోమం వైపే సాగుతుంటే
నిజాయితీ నిలువలేక
తన భవితను గాంచలేక
వెక్కి వెక్కి ఏడ్చిన
రోదనలు వినాల్సిందే
మౌనంగా భరించాల్సిందే....

## ఏ కులం నాకోసముంది

- రవీజ్ రాజా



మెడకో నీచబిళ్ళ
వీపుకు వేలాడే తాటాక
మోకాలి నడక
అన్నీ నిండిన ఐదోవర్ణ
ఉనికిని కాపాడుకునేం
చెమటను చిందించిన ...
రక్త స్రావంతో ప్రమిదల్ని నింపే ఆరోరంగు
దిగుడు బావిలో
గుక్కెడు నీటికోసం కాళ్ళీడ్చే రోజులు
మురికితో జతకట్టి
చూరులో దాగున్న సత్తుగ్లాస్
వంచుకున్న నడుము భారంలో
చేతివేళ్ళలో ఉరేసుకుంటున్న చెప్పులు
ముసుగుల్లేకుండా మన రాజ్యంలో
మారిన ముఖాల్ని ఆనవాలు పట్టలేనపుడు
సిద్ధార్థుణ్ని కరిగించిన అనాథ శవాన్ని నేను
ప్రఖ్యాతులంతా నన్ను
వికారంగానే చిత్రించారు.
ఆలోచన్ల దీర్ఘాన్వేషణలో
గుమ్మంముందు నిల్చున్నపుడు
అన్ని గుళ్ళూ మూసుకున్నపుడు
తన మది తలుపులు తెరిచాడు
బైటికొచ్చి నన్నో మనిషిగా ప్రకటించాడు.
మా కళ్ళకు త్రవ్వకాల కాలయాపనల నిండా
శతాబ్దాల శాంతి భవంతులే.
లోపలికెళ్తున్నది
పాపాల్నుండి పునీతం కావడానికే కాదు
నిలువ నీడ కోసం
వాక్యాల్లో పునర్జన్మ పొందడానికాదు
మళ్ళీ జన్మ గూర్చి ఒక అనాలోచన కోసం
తలపై వేసుకున్న ముసుగు
లోలోపలి నెత్తుటి గాయాల్ని మాన్పుకోడానికి
కన్షెషన్ బాక్సుల్లో నుండైనా
మా పుట్టుక పాపాల్ని చెప్పుకునేందుకు
నన్ను గాయపర్చిన
నాల్గువేదాల సాక్షిగా
నే తిరిగి నీ మతంలోకొస్తే
ఏకులం నాకోసం మిగిలుంది
మళ్ళీ
ఏ అంటరాని కులమో
నాకోసం ఎదురు చూస్తుంటుంది గదూ...!!!

## నీడ

- రాజేశ్వరి దివాకర్ల



ప్రతి ఉదయం
వేడి కాఫీతోపాటు
చేదు నిజాలు పొగకమ్ముకుంటాయి
ఆవిరులూదుకుంటూ
విషాదం గొంతు దిగుతుంది
పోను పోను బీభత్సానికి
కన్నీరు పెగలక గూడుకడుతుంది
గుండె ఉన్నచోటునే ఉండి
కొట్టుకుంటుంది
దుఃఖం వెనుక నేపథ్యం
ఉత్కంఠను కలిగిస్తుంది
దూరదర్శన వార్తాక్షేత్రాలలో
ప్రత్యక్ష కథనం
దారుణ ఫలితాలను
నట్టింటికి తెచ్చి చూపుతుంది.
దుండగులను శిక్షించే విచారక్రమంలో
నిన్నటి పాపం
నేటి ఘాతుకానికి పాతదవుతుంది
ఒక హత్యకు బెదరి
ఒక అమానుషచర్యకు
భయపడిన అలజడిలో
రోజులా తప్పనిసరిగా
బయటకు వెళ్ళగానే
పలుకరించే పరిపాటి నవ్వుల వెనుక
మొండి గోడలు మొలచినట్లుంటుంది
తమను తాము రక్షించుకునే
తాపత్రయంలో
నేరం నాకెదురులేదంటూ
సంచరిస్తుంది
ఎప్పుడు బద్దలౌతుందో
తెలియని ఆకాశం
వెనుక నీడలను గుచ్చి తరుముతుంటుంది
ఇంకా మనుషుల మీద
మాయని నమ్మకమేదో
ఓడిపోవద్దని హెచ్చరిస్తుంది
హృదయప్రేమల కాంతిపుంజం
రహదారి దీపమై
తోవచూపుతుంది

# రైతుకు అండగా నిలిచిన కవుల గొంతుకలు




జనవరి 14న ఖమ్మంలో జరిగిన 'రైతు కవిత' సాహితీ స్రవంతి నిర్వహించిన కవి సమ్మేళన సభలో మాట్లాడుతున్న రాష్ట్ర కార్యదర్శి సామినేని రామారావు

దేశానికి వెన్నెముక రైతుకు అండగా కవులు నిలవాల్సిన కాలం యిది. రైతు పండుగ సందర్భంగా అతని కన్నీళ్ళు తుడిచే కర్తవ్యంలో భాగంగా ఖమ్మం కవులు సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో సంక్రాంతి పండుగ సందర్భంగా జనవరి 14వ తేదీన జిల్లా గ్రంథాలయంలో "రైతు కవిత" కవి సమ్మేళనం నిర్వహించబడింది. ఈ కవి సమ్మేళనానికి అతిథిగా విచ్చేసిన రైతు సంఘం రాష్ట్ర కార్యదర్శి సామినేని రామారావు సందేశమిస్తూ నీటిని, విత్తనాన్ని, చివరకు భూమిని కూడా రైతుకు దక్కకుండా చేస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాలు రైతును కృంగదీస్తున్నాయని, రైతును హతమార్చే ప్రయత్నాలు జరుగుతున్నాయని, ఈ దేశానికి అన్నం పెట్టే రైతుకు అన్నం కరువైన సమయంలో మనం అండగా నిలవాల్సిన అవసరం వుందని, అందులో కవులు కూడా పాలు పంచుకోవాలని కోరారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆనందాచారి మాట్లాడుతూ విదేశీ కంపెనీల విత్తనాలు, పురుగు మందులలో కల్తీ, ఎరువుల కొరత, విద్యుత్ కోత, సబ్సిడీల ఎత్తివేతతో పాటు అతివృష్టి, అనావృష్టి రైతాంగాన్ని కృంగదీస్తున్నాయని, ఈ నేపథ్యంలో రైతులకు అండదండగా నిలవాల్సిన సమయం ఆసన్నమయిందన్నారు. సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి రౌతు రవి మాట్లాడుతూ సాహితీ స్రవంతి ప్రాముఖ్యతను వివరించారు. అనంతరం ప్రముఖ కవి సాధనాల వెంకటస్వామినాయుడు, ప్రజానాట్యమండలి రాష్ట్ర నాయకులు దేవేంద్ర సమన్వయకర్తలుగా కవి సమ్మేళనంను జరిగింది. కవులు పోతగాని సత్యనారాయణ, అమ్మఒడి బాబు, కన్నెగంటి వెంకటయ్య, శ్రీమతి సునంద, కె. శంకర్ రెడ్డి, కపిల రాంకుమార్, రాచమళ్ళ ఉపేంద్రరావు, బండారు రమేష్, జి. నాగేశ్వరరావు, లెనిన్ శ్రీనివాస్, బాలకవులు హేమంత్, వంశీ భార్గవ్, రాజశేఖర్, మణిదీప్‌లు పాల్గొని కవితల్ని చదివారు.

"కడుపులు నింపుతున్నవాడు / కడతేరిపోవటం / కష్టాల కడలిలో సుడులు తిరగడం / చూస్తూనే ఎలా వూరుకుంటాం? / ఊరుకుంటే ఎలా మనుషులవుతాం!' అంటూ ఆనందాచారి తన కవితలో. "రంగురంగుల ముగ్గులూ, గొబ్బెమ్మలతో అలంకరించిన ప్రతి గడప తడిమాను. అతని ఆచూకీ లేదు / అన్వేషణలో ఆ వ్యక్తిని చూశాను. అతనే... అతనే... నేలమ్మ బిడ్డ / సంతోషం, నాలో అంతలోనే దుఃఖం" వేసిందంటారు రైతును తలచుకొంటూ రాచమళ్ళ ఉపేంద్రరావు. "పాపం పురుడోసుకుంటుంటే నేలమ్మ ! వేళ తప్పి వచ్చిమంది వానమ్మ / అయ్యో! పంట శిశువు నేలరాలింది / రైతు అసువు నింగికేగింది" అంటూ వేదన చెందారు. బండారు రమేష్. "ఆకలి చావులు కావవి / ఆత్మహత్యలు కావవి / ఖచ్చితంగా అవి వాడు పేర్చిన / అమానుష హత్యల చితులే" ... అర్ధాంతర మృత్యువును / ఆహ్వానించే అల్పజీవా? కానే కాదు" కారణభూతమైన సరళీకరణాన్ని ముద్దాయిని చేశారు అమ్మఒడి రత్నమహర్షి. "నా తాత పిసికిన మట్టిని - నా తండ్రి దున్నిన నాగటిని / నమ్ముకున్న నా తమ్ముడు కౌలు రైతై పొలం పొత్తిళ్ళలో / పంట బిడ్డను నిలువెల్ల కళ్ళై మురిసిపోయేవేళ / నోటికి దక్కనీయకుండా దయలేని తుఫాన్ పోరులో ఓడిపోయి కూలబడ్డాడు" అంటూ కన్నెగంటి వెంకటయ్య. రైతన్నలో మనోధైర్యాన్ని నింపుదాం! / ఓటమి కలుపును ఏరివేద్దాం! / చెమట చుక్కలకు చైతన్యాన్నిద్దాం! / మట్టి మనిషిని మహోన్నతంగా నిలుపుదాం! / అంటూ ఆశావాదాన్ని అందించారు శ్రీమతి సునంద. "మైక్రోఫైనాన్స్‌లు నిను / మరణశయ్యపైకి ఉసిగొలిపినా / లైలా తుఫాన్ - నిను నేలకూల్చినా / నీవు మళ్ళీ పుట్టాలి - గతం నుండి వర్తమానంలోకి!" అంటూ ఆహ్వానించారు జి. నాగేశ్వరరావు. "వ్యవసాయరంగాన్ని వెక్కిరిస్తున్న సంక్షోభం, అప్పుడప్పుడు ఓర్వలేని కరెంట్ కాటేస్తుంది / కలుగుల్లో దాగి కనిపించని కుట్రల దాడిలో కనుమరుగవుతున్న రైతును" అంటూ జాలి చూపించాడు లెనిన్ శ్రీనివాస్ తన కవితలో. "ఉరిశిక్షను ఎత్తి వేయాలని / పరి పరి విధముల ఆలోచించే ప్రభుత / ఉరికంబ మెక్కుతున్న రైతులను / పట్టించుకోకపోవడం విడ్డూరం" అంటూ కన్నెర్ర చేశాడు శంకరరెడ్డి. "పెట్టుబడి పెట్టిన ఆసామి గుమ్మం ముందు / గదిలో దూలానికి రైతు శవంలా వేలాడుతుండే / సందర్భాలు రోజూ కోకొల్లలు". "గజేంద్రుడనాదుకోవడానికి శ్రీకృష్ణావతారం యెప్పుడో? ద్వారక నుండి వారు వచ్చేలోగా అంతా శూన్యంగా, నిస్తేజంగా, రైతు కూలి, కూలివాడు కావటమో, కుదేలైన బతుకు నీడ్వలేక నిష్క్రమించడమో జరుగకముందే ఓ సర్కారూ మేల్కో! ఆదుకో" అంటూ హెచ్చరిక చేశాడు కపిల రాంకుమార్. బాలకవులు రాజశేఖర్ "ఆరుగాలం శ్రమించిన రైతు / ఆపదల ఊబిలో చిక్కిశల్యమవుతున్నాడని" అంటే మరో బాలకవి కిషోర్ "జల్ జడివాన జడలు విప్పింది / లైలా హొయలు కురిపించింది / రైతు గుండెలు దిగాలి చేసి / వ్యవసాయాన్ని గుదిబండగా మార్చింది" అని తన ఆవేదన వ్యక్తపరిచాడు. "ఆరుగాలం శ్రమించిన రైతు ఆపదల ఊబిలో చిక్కి / శల్యం అవుతున్నాడు / అప్పుల వలలో చిక్కి అరణ్య రోదన చేస్తున్నాడు" అంటూ బాలకవి రాజశేఖర్. హేమంత్ తన కవితలో "ఇప్పుడైనా పంట చేతికి / వస్తుందేమోనని మళ్ళీ / జీవిత పోరాటాన్ని ప్రారంభిస్తున్నాడు మన అన్నదాత". ఖరీఫ్ పాడైనా రబీయైనా సాయపడుతుందేమోనని ఆశించాడు. వీరేకాక మరికొంతమంది తమ కవితా గళాలతో రైతు జీవనశైలిపై తమదైన తీరులో స్పందించారు. లెనిన్ శ్రీనివాస్ వందన సమర్పణతో కార్యక్రమం విజయవంతంగా ముగిసింది.

# విజయనగరం మెరుగు

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 10వ మెరుగు జనవరి 9న గురజాడ వారి స్వగృహంలో జరిగింది. గంట్రేటి ప్రమీల ఆలపించిన గేయంతో ప్రారంభమైన ఈ చర్చలో చీకటి దివాకర్ మాట్లాడుతూ సీనియర్స్ నుండి జూనియర్స్ వరకు అంతా కలగలుపుకుంటూ గురజాడ అన్నట్లు కొత్త పాతల మేలు కలయికగా 'మెరుగు' సాగుతుందన్నారు. గంటేడ గౌరునాయుడు మాట్లాడుతూ రైతు గొప్పవాడు. ఆశావహమైనటువంటివాడు. పల్లెలకు వెళ్తే కుందిర్లు, కల్లాలు, గడ్డికుప్పలు కనుమరుగయ్యాయని ఆవేదన చెందుతూ ఇది నా ఊరేనా... ఇది నే నడిచిన దారేనా అని పాడుకోవలసి వచ్చిందన్నారు. వెలుగు రామినాయుడు 13 మద్దువలస నిర్వాసిత గ్రామాల ప్రజల బతుకులు ఎట్లా ఉన్నాయో తెలియజేసేందుకు 'బతుకు చిత్రం' అనే లఘు నాటికను చదివి వినిపించారు.

మల్లిపురం జగదీష్ "ఈ కొండ కోనల్లో" అనే పాట పాడుతూ గిరిజనులు ఆధునీకరణ పేరుతో ఎలా అన్యాయమైపోతున్నారో, వారిపై జరుగుతున్న అకృత్యాలను, వారు ఎదుర్కొంటున్న సమస్యలను, ఒత్తిడిని తెలిపి ఆవేదన చెందారు. గిరిజన గ్రామాలు పతనమై, సంప్రదాయాలు కనుమరుగవుతున్నాయన్నారు. నాగరికత పేరుతో జరుగుతున్న దోపిడీ చివరకు ఎక్కడికి వెళుతుందోనని ఆందోళన చెందారు. దీనికి స్పందనగా ప్రతిదీ మారుతుందని, ఆ మార్పు సరైన దిశలో సమాజ పురోగమనానికి ఉపయోగపడేటట్లు చూడాలని దివాకర్ అన్నారు. చాగంటి తులసిగారు స్పందిస్తూ పోయిన నాగరికతను తీసుకురాలేమని, ప్రపంచీకరణ ఫలితంగా గిరిజన గ్రామాలు ఎట్లా అతలాకుతలమవుతున్నాయో తెలిపారు. కవిత బతుకులో నుండే వస్తుందన్నారు. అనంతరం 'కక్షపం' అనే కవితను చదివి వినిపించారు.



ద్వారం దుర్గాప్రసాద్ మాట్లాడుతూ చాసో కథల్లోని కరువు నేపథ్యంలో రాసిన వాటిని వివరిస్తూ ఈనాటి పరిస్థితులకు అద్దం పట్టినట్టుగా ఉన్నదన్నారు. గురజాడ రచనలను ముందుచూపుతో రాశారని, అందరూ చదివి అర్థం చేసుకోవాలన్నారు. యు.ఎ. నరసింహమూర్తిగారు మాట్లాడుతూ ప్రతి కవి తన కోసం రాయడు, సమాజం కోసం రాస్తాడన్నాడు. రచయిత ఒకదాంట్లో కవిగాను, మరొకదాంట్లో విమర్శకుడిగానూ కన్పిస్తాడు. అందరికీ ఒకే లక్షణం ఉండదన్నారు. 'మెరుగు' మునుపటి కన్నా మెరుగుపడిందన్నారు. డా॥ రామసూరి మాట్లాడుతూ కవిత్వం ఒక కళాశాలకో, విద్యాలయానికో వెళ్ళి చదివితే అందులో ఒకిరిక చేరినా అది నెరవేరినట్లేనన్నారు. జి.ఎస్. చలం, ఎన్.కె. బాబు తదితరులు మాట్లాడగా, గంట్రేటి శ్రీను, శ్రేయ, షణ్ముఖరావు, చక్రధర్ గేయాలను ఆలపించారు. హృషీకేశం, చెళ్ళపిల్ల శ్యామల, ఇల్ల ప్రసన్నలక్ష్మి, గార్గేయ, మొయిద శ్రీనివాస్, రెడ్డి రామకృష్ణ మొదలగువారు తమ కవితలను, ఆర్. శ్యామల సంక్రాంతి హీరో కథను చదివి వినిపించారు.



# కొప్పర్తికి తిలక్ పురస్కారం

తణుకు శ్రీ నన్నయ్య భట్టారక పీఠం ఆధ్వర్యంలో 2010 సంవత్సరానికి గాను తిలక్ పురస్కారాన్ని ప్రముఖ కవి కొప్పర్తికి అందజేయనున్నట్లు ఆ సంస్థ అధ్యక్షులు జి.యస్.వి. ప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. ఆచార్య తంగిరాల సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి, తిలక్ కుమారుడైన దేవరకొండ సత్యానారాయణ(యు.కె.), దేవరకొండ సుబ్రహ్మణ్యం(యు.యస్.ఏ), తిలక్ కుమార్తె యనమండ్ర చంద్రలేఖల సౌజన్యంతో ప్రతీయేటా ఈ పురస్కారం ప్రధానం చేయబడుతున్నదని ఆయన తెలిపారు.



# త్రిపురనేని రామస్వామి 125వ జయంతి ఉత్సవాలు

ఈ సంవత్సరం జనవరి 15 నుండి జనవరి 2012 వరకు ఉత్సవ కమిటీ ఆధ్వర్యంలో ప్రముఖ కవి త్రిపురనేని రామస్వామి 125వ జయంతి ఉత్సవాలను నిర్వహిస్తున్నట్లు కమిటీ కన్వీనర్ త్రిపురనేని సాయిచంద్ ఒక ప్రకటనలో తెలిపారు. జనవరిలో తెనాలి పట్టణంలో విగ్రహ ప్రతిష్టాపన, చెన్నైలో ఫిబ్రవరి నెలలో తమిళ ద్రవిడ పార్టీల నిర్వహణలో, ఇంగ్లండు, అమెరికా తదితర ప్రాంతాలలో మే, జూన్ నెలల్లో 'కవిరాజు భావవైభవ మహాసభల'ను నిర్వహిస్తున్నట్లు తెలిపారు. ఈ సందర్భంగా కవిరాజు సాహిత్యం 4 సంపుటాలను పునర్ముద్రిస్తున్నట్లు తెలియజేశారు. ఆయన రచించిన పాటలతో, సన్నివేశాలతో జీవిత చరిత్ర ఆధారంగా కవిరాజు పేరిట లఘుచిత్రాన్ని సాయిచంద్ సారధ్యంలో నిర్మిస్తున్నట్లు తెలిపారు. ముగింపు ఉత్సవాలను హైదరాబాద్‌లో 2012, జనవరి 15న నిర్వహిస్తామని తెలిపారు. ఈ ఉత్సవాలలో త్రిపురనేని రామస్వామి అభిమానులంతా పాల్గొని విజయవంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేశారు. వివరాలకు 9347500041లో సంప్రదించవచ్చును.

## 'శ్రీశ్రీ-101'వ జయంతి విశేష సంచికకు రచనల ఆహ్వానం

వందమంది రచయితల కొత్త రచనలతో వెలువడిన 'శ్రీశ్రీ-100' తరువాత సంచికగా మరో వందమంది రచయితల సరికొత్త రచనలతో 'శ్రీశ్రీ-101' విశేష సంచికను వెలువరిస్తున్నట్లు శ్రీశ్రీ సాహిత్య నిధి కన్వీనర్ సింగంపల్లి అశోక్ కుమార్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ విశేష సంచిక కోసం శ్రీశ్రీపై కొత్త రచనలను స్వాగతిస్తున్నట్లు తెలిపారు. రచనలను ఫిబ్రవరి 28 లోపుగా **సింగంపల్లి అశోక్ కుమార్, కన్వీనర్, శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతీనగర్, విజయవాడ- 520 004, ఫ్యాక్స్ 0866-6697375, ఇ-మెయిల్ :** srisri_sahityanidhi@yahoo.com చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 0866-6697375, 9246277375 ద్వారా సంప్రదించవచ్చును.

## 'తూర్పార' పద్యకవితా సంకలనానికి రచనల ఆహ్వానం

రైతాంగ సమస్యలపై 'తూర్పార' పద్య కవితా సంకలనాన్ని వెలువరిస్తున్నట్లు రసమయి సాహితీ సమితి, జగ్గయ్యపేట వ్యవస్థాపక అధ్యక్షులు అజ్మీరు వీరభద్రయ్య ఒక ప్రకటనలో తెలిపారు. ఈ సంకలనం కోసం అందిన రచనలలో నుండి ఉత్తమ రచనలను ఎంపికచేసి ప్రోత్సాహక నగదు బహుమతులను అందజేయనున్నట్లు తెలిపారు. కవులు తమ పద్య కవితలను మార్చి 15వ తేది లోపుగా **రసమయి సాహితీ సమితి, డోర్ నెం. 8-102/8, అయ్యప్ప స్వామి గుడి వద్ద, జగ్గయ్యపేట- 521175, కృష్ణాజిల్లా** చిరునామాకు పంపించవలసిందిగా ఆ ప్రకటనలో కోరారు. ఇతర వివరాలకు 9290879849 సంప్రదించవచ్చును.

## కథ, కవిత, నవలా పురస్కారాలకు ఆహ్వానం

కడప కవిత విద్యా సాంస్కృతిక సేవాసంస్థ ఆధ్వర్యంలో 'గురజాడ' కథా పురస్కారం, 'శ్రీశ్రీ కవితా పురస్కారం', 'కందుకూరి నవలా పురస్కారం' ఇవ్వనున్నట్లు సంస్థ అధ్యక్షులు అలపర్తి పిచ్చయ్య చౌదరి ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారం క్రింద మూడువేల రూపాయల నగదును ఇచ్చి సత్కరించనున్నట్లు తెలిపారు. కవులు, రచయితలు తమ కథ, కవితా సంపుటాలను రెండేసి ప్రతులను **అబ్బిగారి రాజేంద్రప్రసాద్, ఎల్.ఎఫ్.ఎల్. హెడ్మాష్టర్, మండల పరిషత్ పాఠశాల, అనంతరాజు పేట పోస్టు, రైల్వే కోడూరు మండలం, వైయస్.ఆర్. జిల్లా- 516 105** చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. వివరాలకు 9000358012 ద్వారా సంప్రదించవలసిందిగా విజ్ఞప్తి చేశారు.

## 'ఆవరణం'కు వ్యాసాలు రాయండి!

ప్రముఖ సాహితీవేత్త, బయాలజీ ప్రొఫెసర్ డాక్టర్ దేవరాజు మహారాజు వ్యక్తిత్వం, సాహిత్యం అంశాల ఆధారంగా మిత్రులు, అభిమాన పాఠకులు, విద్యార్థులు వ్యాసాలు పంపించవలసిందిగా అంబికానంద్ ఒక ప్రకటనలో కోరారు. 'ఆవరణం' పేరుతో ప్రత్యేక సంచిక వెలువరించనున్నట్లు ఆయన తెలిపారు. అర్ధశతాబ్ది (1960-2010) కాలంగా సాహిత్య పాపులర్ సైన్స్ రంగాలలో దేవరాజు మహారాజు చేస్తున్న కృషి అందరికీ తెలిసిందేనని తెలిపారు. వ్యాసాలను నెలరోజుల లోపు **అంబికానంద్, 101, భావ్య బాలాజీ టవర్స్, సాయినాథపురం, ఎ.ఎస్. రావు నగర్, సికింద్రాబాద్- 500 062** చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9247125509 ద్వారా సంప్రదించవచ్చును.

## ఉగాది కథ, కవితల పోటీకి ఆహ్వానం

విశాలాక్షి సాహిత్య పత్రిక ప్రథమ వార్షికోత్సవం సందర్భంగా కథ, కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఆ పత్రిక తరపున ఒక ప్రకటనలో తెలిపారు. రచనలను మార్చి 10వ తేదీలోపుగా 'విశాలాక్షి తెలుగు మాసపత్రిక, 15-941, మొదటి అంతస్తు, వెంకట రామాపురం, విజయమహల్ సెంటరు, నెల్లూరు-524 001 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. కథలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా వరుసగా ఐదు వేలు, మూడు వేలు, రెండు వేల రూపాయలను, కవితలకు మూడు వేలు, రెండు వేలు, ఒక వెయ్యి రూపాయల నగదును అందివ్వనున్నట్లు తెలిపారు. ఏప్రిల్ నెలలో జరిగే ఒక కార్యక్రమంలో ఈ బహుమతులను అందజేస్తామని తెలిపారు. ఇతర వివరాలకు 0861-6454494, 9246430084, 9885457494 ద్వారా సంప్రదించవచ్చును.

## మినీ కవితా ప్రతిభా పురస్కారం



ప్రతి ఏడాది ఇచ్చే మినీ కవితా ప్రతిభా పురస్కారాన్ని మచిలీపట్నం సాహితీ మిత్రుల సంస్థ 2010 సంవత్సరానికి కవయిత్రి శైలజా మిత్రకి అందజేస్తున్నట్లు సంస్థ అధ్యక్షులు డా॥ రావి రంగారావు ఒక ప్రకటనలో తెలియజేశారు. జనవరి 30వ తేదీన ఉదయం మచిలీపట్నం టౌన్‌హాలులో జరిగే సంస్థ 30వ వార్షికోత్సవంలో ఈ పురస్కారం అందించనున్నట్లు రంగారావుగారు తెలియజేశారు. అదే సభలో శైలజామిత్ర రచించిన "అగ్నిపూలు" మినీ కవితా సంకలనం ప్రముఖ సాహితీవేత్తల సమక్షంలో ఆవిష్కరింపబడుతుందని తెలిపారు.

# వెలుగునిచ్చే కవిత్వం




'స్పందన' అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో జనవరి 14న అనంతపురంలో జరిగిన డా।। ఎస్. షమీఉల్లా "సూర్యోదయానంతరం" కవితా సంపుటి ఆవిష్కరణ కార్యక్రమంలో పాల్గొన్న కవులు సుంకోజి దేవేంద్రాచారి, టి.రాజారాం, ఆచార్య కొలకలూరి ఇనాక్, డా।। ఎస్. షమీఉల్లా, ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, కవి చం., పలమనేరు బాలాజీ

కవి సమాజానికి వెలుగు ప్రదాత అని సాహితీవేత్త, కథకులు ఆచార్య కొలకలూరి ఇనాక్ పేర్కొన్నారు. ఎన్‌జిఒ హోంలో 'స్పందన' అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో జనవరి 14న ఏర్పాటు చేసిన డాక్టరు షమీఉల్లా రచించిన 'సూర్యోదయానంతరం' పుస్తకావిష్కరణ సభలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. షమీఉల్లా కవిత్వం నిండా ఆవేదన, ఆక్రందన, దుఃఖం, నిరాశ, కొంచెం సంతోషం, ఆనందం ఉన్నాయన్నారు. ఇవన్నీ సమాజంలో మన చుట్టూ నివసిస్తున్న జీవితాల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తాయన్నారు. కలగనే వాడే భవిష్యత్తును శాసించి, ఒక కొత్త శక్తిగా రూపాంతరం చెందుతాడన్న అభిప్రాయాన్ని కవితల్లో చొప్పించిన షమీ ఉల్లాకు మంచి సాహిత్య భవిష్యత్తు వుందని అభినందించారు. ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి మాట్లాడుతూ ప్రతి కవిత యువతను చీకటి నుంచి వెలుగు వైపు పయనింపజేసేలా ఉందన్నారు. సమాజానికి దర్పణం పడుతూ వాటిలో కొన్నింటికి పరిష్కారాలను చూపడం అభినందనీయమని అన్నారు. అద్భుత భావచిత్రాల్లో సాగిన షమీఉల్లా కవిత్వానికి చదివించదగ్గ శక్తి ఉందని వివరించారు. స్పందన అధ్యక్షుడు 'అతడు' రాజారాం మాట్లాడుతూ సూర్యోదయానంతరం వెలుగు ప్రసరిస్తుంది. అలాంటి వెలుగును తన కవితల ద్వారా ప్రసరింపజేసిన కవి షమీ ఉల్లా అంటూ కొనియాడారు. సాహితీవేత్తలు పలమనేరు బాలాజీ, సుంకోజీ, దేవేంద్రాచారి, చంద్రశేఖర శాస్త్రి, రాధేయ తదితరులు ఆయన కవిత్వాన్ని కొనియాడారు.

# సమాజ హితానికి సాహిత్యం దోహదపడాలి




జనవరి 9న కరీంనగర్‌లో కవి, రచయిత దాస్యం సేనాధిపతి రచించిన 'దర్శనం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న శాతవాహన విశ్వ విద్యాలయం వి.సి. ప్రొ।। ఎం.డి. ఇక్బాల్ అలీ చిత్రంలో ఎడమ నుండి శైలజామిత్ర, బైసదేవ్‌దాస్, సౌభాగ్యదేవి, రచయిత సేనాధిపతి, ఎం. గోపాల్ తదితరులు

సమాజ హితానికి సాహిత్యం దోహదపడాలని శాతవాహన విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రొ।। ఎం.డి ఇక్బాల్ అలీ అన్నారు. జనవరి 9వ తేదీన కరీంనగర్‌లో సాహితీ గౌతమీ ఆధ్వర్యంలో దాస్యం సేనాధిపతి రచించిన 'దర్శనం' గ్రంథా విష్కరణ సభకు ఆయన ముఖ్య అతిథిగా, ఆవిష్కర్తగా సభకు హాజరై మాట్లాడుతూ గ్రంథ సమీక్ష సాహిత్య ప్రక్రియల్లో క్లిష్టమైనదని పేర్కొన్నారు. వాణిజ్య శాస్త్రోపన్యాసకునిగా దాస్యం సేనాధిపతి తమ వృత్తిధర్మాన్ని నిర్వర్తిస్తూనే సాహిత్య సృజనను ప్రవృత్తిగా మార్చుకోవడం అభినందనీయమని అన్నారు. సాహితీగౌతమి అధ్యక్షులు మాడిశెట్టి గోపాల్ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో ప్రముఖ కవయిత్రి, విమర్శకురాలు శైలజామిత్ర గ్రంథాన్ని సమీక్షిస్తూ ఆధునిక విమర్శకుల్లో దాస్యం సేనాధిపతి తమకంటూ ప్రత్యేక స్థానాన్ని పదిలపరుచుకున్నారని అన్నారు. తమదైన శైలిలో వైవిధ్యంతో కూడిన గ్రంథ సమీక్షలతో సేనాధిపతి 'దర్శనం' పేరుతో గ్రంథాన్ని వెలువరించడం ప్రశంసనీయమని అన్నారు. నేటి నిజం సంపాదకులు బైసదేవదాస్ కృతి స్వీకర్తగా హాజరై మాట్లాడుతూ నేడు కరీంనగర్ జిల్లా నుండి వస్తున్న సాహిత్యంలో జవజీవాలున్నాయని పేర్కొన్నారు. ఎంత ఎదిగినా ఒదిగివుండే దాస్యం సేనాధిపతి కవిగా, రచయితగా, విమర్శకునిగా రాణించడం సంతోషదాయకమని అన్నారు.

సాహితీవేత్త డా।। ద్వానాశాస్త్రి మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాల్లో దాస్యం సేనాధిపతి తమ సహృదయ సమీక్షలతో సాహితీమిత్రులను సంపాదించుకున్నారని అన్నారు. ప్రముఖ కథారచయిత కాలువ మల్లయ్య, డా।। బోయినపల్లి వెంకటరామారావు, డా।। డింగరి నరహరి ఆచార్య, అన్నవరం దేవేందర్, జి.వి.కృష్ణమూర్తి, కె.ఎస్ అనంతాచార్య సముద్రాల వేణుగోపాలాచార్య, దాస్యం లక్ష్మయ్య, పంజాల జగన్నాథం, సూర్యప్రకాశ్, డా।। దేవరావు డా।। గంద్ర లక్ష్మణరావు, గాజోజు నాగభూషణం, వి. లక్ష్మి డా।। ఎ. సుజాత, డి. గీతారాణి, డి. వినోద్, డి. స్వప్న, రఘు, రవీందర్, బి. వీణాదాస్, సౌభాగ్యదేవి, శశికిరణ్మయి, కె. తిరుపతి,రాము, సిరిసిల్ల గఫూర్ శిక్షక్, సి. హెచ్. ప్రకాశ్, తోకల రాజేశం, చంద్రప్రభాకర్‌లతో పాటు మెదక్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాలకు చెందిన 200 మంది కవులు, రచయితలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. డా. బి.వి.ఎన్. స్వామి స్వాగతం పలుకగా కె.ఎస్. అనంతాచార్య వందన సమర్పణ చేశారు.

## నివాళి

# జ్ఞానానంద కవి



ప్రముఖ సాహితీవేత్త, కళాప్రపూర్ణ డాక్టర్ జ్ఞానానంద కవి జనవరి 7న కన్ను మూశారు. ఆయన వయస్సు 88 సంవత్సరాలు. ఆయన గతేడాదిన్నరగా నడకుదురు వృద్ధుల ఆశ్రమంలో కాలం గడుపుతున్నారు. తీవ్ర అనారోగ్యంతో లైఫ్‌లైన్ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ కన్నుమూశారు. జ్ఞానానందకవి 1922 జులై 16న విజయనగరం జిల్లా, బొబ్బిలి వద్ద పెదకంచి గ్రామంలో నిరుపేద కుటుంబంలో జన్మించారు. తల్లి పాపమ్మ, తండ్రి పాపయ్య. కాకినాడ మెక్లారిన్ హైస్కూల్లో 35 సంవత్సరాల పాటు తెలుగు పండితుడిగా పనిచేసి, అక్కడే ఉద్యోగ విరమణ చేశారు. 1954లో ఆయనకు శ్రీకాకుళం జిల్లాకు చెందిన సుగుణమణితో వివాహం అయింది. వారికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు ఉన్నారు. జ్ఞానానందకవి పలు రచనలు చేశారు. ఆమ్రపాలి, గోల్కొండ, క్రీస్తు ప్రబంధము, నా జీవిత గాథ, పిల్లనగ్రోవి, ధర్మాగ్రహము, అక్షర పూజ, పాంచజన్యము తదితర పుస్తకాల వంటివి వీటిలో ప్రధానమైనవి.

# కన్నబీరన్



విశాఖపట్నం జిల్లాలోని యలమంచిలో 'అవగాహన' సాహిత్యోద్యమ సంస్థ ఆధ్వర్యంలో జనవరి 2న కణ్ణబీరాన్ సంస్మరణ సభ జరిగింది. ఈ సందర్భంగా అవగాహన సంస్థ వ్యవస్థాపక అధ్యక్షులు మానేపల్లి కన్నబీరన్ పౌరహక్కుల ఉద్యమం కృషి గురించి వివరించారు. విశాఖ జిల్లా ఏ.పి.సి.యల్.సి. అధ్యక్షులు టి. శ్రీరామ్మూర్తి మాట్లాడుతూ కన్నబీరన్‌లోని దీక్ష, పనిపట్ల అంకితభావం, రాజ్యాంగ సూక్ష్మాల్ని, కీలకాంశాల వివరణ వంటి లక్షణాలు మార్గదర్శకమని అన్నారు. కడలి రామచంద్రరావు, కె. విల్సన్, సింహాద్రిరావు, నరసింగ రావు, డి.ఎస్.నారాయణ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొని కన్నబీరాన్‌కు నివాళి అర్పించారు. 2010 డిసెంబరు 30న సికింద్రాబాద్‌లోని వెస్ట్‌మారేడ్‌పల్లిలో కన్నబీరన్ అంతిమశ్వాస విడిచారు.

# ఎన్.ఆర్. చందూర్



ప్రఖ్యాత తెలుగు కథా, నవలా రచయిత ఎన్.ఆర్. చందూర్ (మాలతీచందూర్ భర్త) చెన్నైలో జనవరి 11న కన్నుమూశారు. భద్రాచలం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఎన్.ఆర్. చందూర్‌కి నివాళి సభ జరిగింది. ఎన్.ఆర్. చందూర్ పలు గ్రంథాలు రాశారని, ఆంగ్లం నుండి అనేక అనువాదాలు చేశారని, జగతి సాహిత్య మాసపత్రికను క్రమబద్ధంగా తీసుకొచ్చారని పలువురు వక్తలు పేర్కొన్నారు. మాల్యశ్రీ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో వీధుల రాంబాబు, తాతోలు దుర్గాచారి, ఆర్.ఎస్. రావు, జి. రామరాజు, జి.వి. కృష్ణమూర్తి, శ్రీధిరాల వెంకటాచారి ప్రభృతులు ప్రసంగించారు.

# గుడిహాళం



ప్రముఖకవి, రచయిత, పాత్రికేయుడు గుడిహాళం రఘునాథం (54) డిసెంబర్ 28న కన్నుమూశారు. చాలాకాలంగా మధుమేహంతో బాధపడుతున్న గుడిహాళం గత పది రోజులుగా కోమాలో ఉన్నారు. హైదరాబాద్ మలక్‌పేటలోని యశోద ఆసుపత్రిలో చికిత్స పొందుతూ కన్నుమూశారు. విపశ్యన కవుల్లో అగ్రాసనం పొందిన గుడిహాళం రాష్ట్రవ్యాప్తంగా అనేకమంది అభిమానులను సంపాదించుకున్నారు. ఫోర్త్ పర్సన్ సింగ్యులర్, ఒక జననం ఒక మరణం వంటి కవితా సంకలనాలు వెలువరించారు. విపశ్యన కవులతో కలిసి సముద్రాలతో సంఘర్షణలతో, నల్ల వజ్రం తదితర సంయుక్త కవితా సంపుటాలు ప్రచురించారు. ప్రముఖ తెలుగు దిన పత్రికలన్నింటిలో గుడిహాళం కవితలు అచ్చయ్యాయి. ఆయన మెదక్ జిల్లా సదాశివపేటలో ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసారు. తెలుగు కవిత్వంలో అనేక ప్రయోగాలకు నాంది పలికిన గడిహాళం మహబూబ్‌నగర్ జిల్లా అమరచింతలో 1956, ఫిబ్రవరి 23న జన్మించారు.

## చందాదారులకు ఓ విన్నపం

(1) ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు. (రెన్యువల్స్).

(2) కంప్యూటర్‌లోని రికార్డులో చందా ముగియడంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్‌గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.

(3) ఆన్‌లైన్‌లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్‌బిహెచ్. ఆన్‌లైన్‌లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.

(4) సాహితీస్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్‌లైన్‌లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్‌లైన్‌లో జమచేసినందుకు రూ. 25/-లు కట్ అవుతుంది.

(5) 5 సం॥ చందా డిస్కౌంట్‌లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్‌లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).

(6) ఎం.ఓ. పంపే వారు కూపన్‌కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. Prasthanam_ss@yahoo.co.in.

# 'గమనం' ఆవిష్కరణ



సత్యభాస్కర్ కథల సంపుటి 'గమనం' ఆవిష్కరణ సభ బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్, హైదరాబాద్‌లో డిసెంబర్ 11న జరిగింది. రచయిత, విమర్శకుడు విహారి ఆవిష్కరించగా, ఆచార్య కొలకలూరి ఇనాక్ ముఖ్య అతిథిగా, డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు, డా॥ వేదగిరి రాంబాబు, చిక్కు మురళీమోహన్‌లు వక్తలుగా సభలో పాల్గొన్నారు. డా॥ పోతుకూచి సాంబశివరావు సభాధ్యక్షత వహించగా, డా॥ విప్లవదత్ శుక్లా సమన్వయం చేశారు.

విహారి మాట్లాడుతూ సత్యభాస్కర్ కథలు వివిధ పత్రికలలో ప్రచురితమయి గెలిచాయని అభినందించారు. మంచి కథకుడికుండాల్సిన సంస్కారం, భాష, మానవ సంబంధాలు ఈ కథల నిండా ఉన్నాయని అన్నారు. ఈ కథల సంపుటికి ముందుమాట రాసిన ఆచార్య కొలకలూరి ఇనాక్ సత్యభాస్కర్ కథలలోని పాత్రలు మనలని వెంటాడుతాయని మరచిపోనివ్వవని అన్నారు. కార్మికులు, మధ్యతరగతి, విప్లవోద్యమాలు ఈ కథలు పరిచయం చేస్తాయని, ఇవి మూసకథలు కాదు ప్రయోగాత్మక కథలని ప్రశంసించారు. డా॥ అద్దేపల్లి ఈ సంపుటిలోని 'అపరిచిత' కథ నేటి రచయితలలోని తొంభై శాతం మందిని ఉలిక్కిపడేలాగా చేస్తుందని వివరించారు. ఎంతోమందికి తెలియని కార్మికుల రోజువారి ఘర్షణను కథలుగా మలచిన తీరు అద్భుతమని అన్నారు. ప్రముఖ సామాజిక కార్యకర్త చిక్కు మురళీమోహన్ తన ప్రసంగంలో 'గమనం', 'పరిష్కారం' కథలను ప్రస్తావించారు. రచయిత నిజాయితీ, దృఢ సంకల్పం ఈ కథలు ప్రతిఫలిస్తాయని అన్నారు. డా॥ వేదగిరి రాంబాబు మాట్లాడుతూ సాహిత్యంలో కథకుల పాత్రను వివరించారు. కథల పుస్తకాలను కొని చదవడం పాఠకులు అలవాటు చేసుకుని తెలుగు కథను బతికించుకోవాలని విజ్ఞప్తి చేశారు.

జనమిత్ర ఫౌండేషన్ తరపున ఈ కార్యక్రమాన్ని డా॥ విప్లవ్‌దత్ శుక్లా నిర్వహించగా, బొపార, తుమ్మకొమ్మ విజయబాబురావు, తంగెళ్ళపల్లి కనకాచారి సహకరించారు. తంగిరాల మెమోరియల్ ట్రస్ట్ అధ్యక్షులు తంగిరాల చక్రవర్తి, బొపార, జనమిత్ర ఫౌండేషన్‌ల రచయిత సత్యభాస్కర్‌ను ఘనంగా సత్కరించారు.

# వెలుగు నీడలు ఆవిష్కరణ



మానస ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో కవయిత్రి శ్రీమతి గీతా రఘురామ్ రచించిన వెలుగునీడలు కవితా సంపుటి ఆవిష్కరణ డిసెంబర్ 26వ తేది ఆదివారం నగర కేంద్ర గ్రంథాలయంలో జరిగింది. హెకా పూర్వ అధ్యక్షులు పర్యాద కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమానికి కవి, విమర్శకులు డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు ముఖ్య అతిథిగా విచ్చేసి గ్రంథాన్ని ఆవిష్కరించారు. అనంతరం అద్దేపల్లి మాట్లాడుతూ మనస్సుకి అంతరంగ చలనం ఉంది. బహిరంగ చలనం ఉంది, మనసులోని తరంగాల్ని కవిత్వీకరించటమే భావుకతలోని అందం. ఆనంద విషాదాలకాలవాలమైన మనస్సుండటమే మనిషి అదృష్టం. దానికి ఆలోచన తోడైతే అద్భుతాలు జరుగుతాయి. వాటిని అక్షరాల్లో పొదగటమే కవులు, రచయితలు చేయాల్సిన పని. గీతా రఘురామ్‌కు తన మనసులోని భావాల్ని సూటిగా, నిర్మలంగా వెలువరించటం ముదావహం అన్నారు. ఇంకా సభలో డా॥ తిరునగరి, శ్రీమతి కేతవరపు రాజ్యశ్రీ, రెక్కల సృష్టికర్త ఎం.కె. సుగమ్‌బాబు, డా॥ పి. సరళ, రఘుశ్రీ, సినీనటులు చిట్టిబాబు ప్రసంగించారు. అనంతరం గ్రంథ రచయిత్రి శ్రీమతి గీతా రఘురామ్‌ను నిర్వాహక సంస్థ పక్షాన అతిథులు సత్కరించారు. రచయిత్రి గ్రంథాన్ని తన తల్లిదండ్రులు డా॥ డి. మధుసూదన్, శ్రీమతి రోహిణీదేవికి అంకితమిచ్చి నూతన వస్త్రాలు బహుకరించి సత్కరించారు. పెద్దూరి వెంకటదాసు, మానస రఘుశ్రీలు సమన్వయకర్తలుగా వ్యవహరించారు.

# కందుకూరి శ్రీరాములుకు పురస్కారం



'ఈదూరు సుబ్బయ్య సాహితీ అవార్డు' కు 'రావి రూకుల' కవితా సంపుటి ఎంపికయినట్లు నెరసం కార్యదర్శి పాతూరి అన్నపూర్ణ ఒక ప్రకటనలో తెలిపారు. ఈదూరు సుబ్బయ్య కుమారులు ఈదూరు శేషయ్య, డాక్టర్ ఈదూరు సుధాకర్‌లు 2010 సంవత్సరానికి గాను ఈ పురస్కారాన్ని అందివ్వనున్నట్లు తెలిపారు. ఈ పోటీకి 58 మంది కవులు కవితా సంపుటాలను పంపించినట్లు తెలిపారు. న్యాయనిర్ణేతలు కందుకూరి శ్రీరాములు రచించిన 'రావి రూకుల' కవితా సంపుటిని ఈ అవార్డుకు ఎంపికచేశారని తెలిపారు. నెల్లూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 12న నెల్లూరు,ఐ.ఎం.ఏ హాలులో ఈ పురస్కారాన్ని అందించనున్నట్లు తెలిపారు.



ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ సౌజన్యంతో రంజని తెలుగు సాంస్కృతిక సంస్థ హైదరాబాద్ వారి కవితల పోటీలలో జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డి చేతుల మీదుగా బహుమతి స్వీకరిస్తున్న కవి వడలి రాధాకృష్ణ. ఇంకా డా॥ అద్దేపల్లి రామమోహనరావు, సాంస్కృతిక శాఖ సంచాలకులు డా॥ ఎం. కాంతారావు, దర్భశయనం శ్రీనివాసాచార్య, మెహజబీన్




జనవరి 1న హైదరాబాద్‌లో విశ్వకళాపీఠం వారి స్నేహనిధి పురస్కారాన్ని శిఖామణికి అందజేస్తున్న కె. శివారెడ్డి. చిత్రంలో పీఠం అధ్యక్షులు డా॥ ఎ.వి. వీరభద్రాచారి




హైదరాబాద్‌లో 'విశ్వసాహితి' నిర్వహించిన 11వ అఖిల భారత తెలుగు రచయితల సభలలో "రచయితల సమస్యలు"పై ప్రసంగిస్తున్న డా॥ ద్వా.నా. శాస్త్రి. చిత్రంలో మాజీ మంత్రి పి.వి. రంగారావు, విశ్వసాహితి అధ్యక్షులు డా॥ పోతుకూచి సాంబశివరావు, కథా రచయిత సలీం



డిసెంబర్ 25న విజయవాడలో 'పంపకాలు' కవితకు గాను 'ఎక్స్‌రే-2010 జాతీయ స్థాయి ఉత్తమ కవితా అవార్డు'ను ప్రముఖ కవి, దేవిప్రియ, జానపద కళాకేంద్రం అధ్యక్షులు అంబటి మధుమోహనకృష్ణ తదితరుల నుండి స్వీకరిస్తున్న కవి చలపాక ప్రకాష్



డిసెంబర్ 30న విశాఖపట్నంలో టర్నర్ చౌల్ట్రీ విశాలాంధ్ర బుక్ ఫెస్టివల్‌లో "పురిపండా అప్పలస్వామి అవార్డు"ను అందుకుంటున్న ప్రొ॥ వెలమల సిమ్మన్న. చిత్రంలో మాజీ ఎమ్మెల్యే మానం ఆంజనేయులు, ప్రొ॥ చందు సుబ్బారావు




'స్పందన' అనంత కవుల వేదిక ఆధ్వర్యంలో జనవరి 14న అనంతపురంలో ప్రముఖ ఆంగ్ల అనువాదకులు దేశెట్టి కేశవరావుకి చం. స్పందన-2010' ఆత్మీయ సాహితీ పురస్కారాన్ని అందజేస్తున్న కవి చం, ఆచార్య కొలకలూరి ఇనాక్, ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, టి. రాజారాం, డా॥ ఎస్. షమీఉల్లా

## నూతన సంవత్సర కవి సమ్మేళనం

భద్రాచలం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో స్థానిక లిటిల్ ఫ్లవర్స్ విద్యాసంస్థల ప్రాంగణంలో నూతన సంవత్సరం సందర్భంగా కవి సమ్మేళనం జరిగింది. ఎంతో రసరమ్యంగా జరిగిన ఈ సభకు అధ్యక్షులు మాల్యశ్రీ, ముఖ్య అతిథిగా మాగంటి సూర్యం ఆహుతులయ్యారు. తొలుత కార్యదర్శి తాతోలు దుర్గాచారి, సాహితీ స్రవంతి దశాబ్ది కాలంగా జరిపిన సాహిత్య ప్రస్థానాన్ని, జరగబోయే కర్తవ్యాలను సభకు తెలుపుతూ అందరికీ స్వాగతం పలికారు. మాల్యశ్రీ సంస్థ ఉద్దేశాన్ని, చేయబోయే కార్యక్రమాలను తెలియజేశారు.

తదుపరి జరిగిన కవి సమ్మేళనంలో ధిరాల వెంకటాచారి, వీధుల రాంబాబు, ఆర్.ఎస్. రావు, అమ్మిరాజు, జి. గోపాలకృష్ణ, ఆదినారాయణ, టి. దుర్గాచారి, పి. విష్ణుమూర్తి, కె.వి.వి.ఎస్. మూర్తి, ఆవుల సుబ్బారావు తదితరులు పాల్గొని తమ తమ కవితలను, గేయాలను సభారంజకంగా ఆలపించారు. రాంబాబు వందన సమర్పణతో సభ ముగిసింది.

## ప్రేరణ కలిగించిన కవి సమ్మేళనం

జనవరి 20 నుండి కె.వి.పి.ఎస్., వ్యవసాయ కార్మిక సంఘం సంయుక్తంగా తలపెట్టిన దళితవాడల అభివృద్ధి యాత్రకు మద్దతుగా జనవరి 16న ఖమ్మం పట్టణంలోని బోడేపూడి విజ్ఞానకేంద్రంలోని మంచికంటి భవన్‌లో ఆదివారం మీ కోసంలో భాగంగా కవి సమ్మేళనం జరిగింది. సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనంలో కొత్త కవులు తమ గళాలను సవరించుకున్నారు. తమ్మినేని వీరభద్రంతో సహా 15 మంది తమ కవితలను చదివి వినిపించారు. ఆనందాచారి దళిత సాహిత్య వికాసం - పరిణామ క్రమం క్లుప్తంగా వివరించారు. శ్రీమతి హిమబిందు, పెండ్యాల శ్రీధర్, లెనిన్ శ్రీనివాస్, కపిల రాంకుమార్, కె. శంకరరెడ్డి, రాచమళ్ళ ఉపేంద్రరావు, డి. శ్రీనివాస్, అమ్మవడి రత్న మహర్షి, మోతె మల్లయ్య, బండారు రమేష్, నెల్లూరి నరసింహారావు, సునీత, పోతగాని సత్యనారాయణ, రౌతు రవి, కన్నెగంటి వెంకటయ్య తదితరులు తమ కవితలు వినిపించారు. సర్వనేని శ్రీనివాస్ కవి సమ్మేళనం ప్రారంభించగా, ఇనపనూరి జోసఫ్ వందన సమర్పణ చేస్తూ, దళితయాత్రను విజయవంతం చేయడానికి మరింత ఉత్సాహాన్నీ, ప్రేరణ కలిగించిన కవులకు అభినందనలు తెలిపారు.

## నశీర్ అహమ్మద్ చరిత్ర గ్రంథాలను

### ఇక... ఉచితంగా 'డౌన్‌లోడ్' చేసుకోవచ్చు

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ తాను రాసిన తొమ్మిది చరిత్ర గ్రంథాలను www. Vikasadhatri.org నుండి ఉచితంగా 'డౌన్‌లోడ్' చేసుకునే ఏర్పాటు చేసినట్లు సయ్యద్ నశీర్ అహమ్మద్ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ వెబ్ సైట్‌లో 1) భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిలు , 2) భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు, 3) భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజా పోరాటం 4) భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం యోధులు, 5) మైసూరు పులి : టీపూ సుల్తాన్, 6) షహీద్ - యే - ఆజం అష్ఫాఖుల్లాఖాన్, 7) చిరస్మరణీయులు, 8) 1857 : ముస్లింలు, 9) అక్షర శిల్పులు అను గ్రంథాలను పొందుపర్చినట్టు ఆయన వివరించారు. గుంటూరు జిల్లా జంపని గ్రామానికి చెందిన గాలి ఉదయకుమార్ నిర్వహిస్తున్న www. Vikasadhatri.org ద్వారా ప్రముఖ తెలుగు రచయితల గ్రంథాలను ఎటువంటి ఖర్చు లేకుండా 'డౌన్‌లోడ్' చేసుకోగల అవకాశం ఉన్నందున ఆసక్తిగల సాహిత్యాభిమానులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాల్సిందిగా నశీర్ అహమ్మద్ కోరారు.



డిసెంబర్ 10న మార్కాపురం నెలనెలా వెన్నెల సాహితీ వేదిక ఆధ్వర్యంలో జరిగిన సభలో 'శ్రీనాథుని కవితా వైభవం'పై ప్రసంగించిన ప్రముఖ సాహితీవేత్త డి.వి.ఎం. సత్యనారాయణను సత్కరించిన దృశ్యం. చిత్రంలో (ఎడమ నుంచి వరుసగా) కె.వి. రమణారెడ్డి, సుబ్రమణ్యం, దిట్టకవి, పావులూరి మల్లిఖార్జున, హెచ్. మహేశ్వరాచారి, ఓరుగంటి మల్లిక్, కె. మధుసూదనశాస్త్రి, జి.వి.ఎల్. రమేష్‌బాబు, ఎం.వి. సుబ్బారావు, తోట శ్రీనివాసరావు, కాళంగి శ్రీనివాసులు, టి.వి. వెంకటేశ్వర్లు



డిసెంబర్ 26న నిజామాబాద్ జిల్లా కామారెడ్డిలో కవి సిరిసిల్లా గఫూర్ శిక్షక్ కవిత్వం "చైతన్య వసంతం" ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో (ఎడమ నుండి కుడికి) విఠల్‌రావు, గఫూర్ శిక్షక్, ఆవిష్కర్త నేటి నిజం సంపాదకులు బైస దేవదాసు, కవి దాస్యం సేనాధిపతి, డా॥ అయాచితం నటేశ్వరశర్మ, హరికిషన్‌గౌడ్

# శశిశ్రీకి 'చాసో స్ఫూర్తి సాహిత్య పురస్కారం'



జనవరి 17న జరిగిన 'చాసో స్ఫూర్తి సాహిత్య సభ'లో పురస్కారగ్రహీత శశిశ్రీ, చాగంటి తులసి, ఎండ్లూరి సుధాకర్, సి. రాఘవాచారి, దేవరాజు మహారాజు

ప్రముఖ రచయిత, సాహిత్యనేత్రం పత్రిక సంపాదకులు శశిశ్రీకి 'చాసో స్ఫూర్తి సాహిత్య పురస్కారం' లభించింది. తెలుగు కథాశిల్పిగా పేరొందిన ప్రసిద్ధ సాహితీవేత్త చాగంటి సోమయాజులు పేరిట ఈ పురస్కారాన్ని ప్రతీయేటా ఒక కథా రచయితకు ప్రధానం చేస్తున్నారు. చాసో 96వ పుట్టిన రోజు సందర్భంగా జనవరి 17న విజయనగరంలో చాసో స్ఫూర్తి సాహిత్యసభలో ఈ పురస్కారాన్ని అందజేశారు. ఈ సభకు అధ్యక్షత వహించిన విశాలాంధ్ర పూర్వ సంపాదకులు సి. రాఘవాచారి మాట్లాడుతూ వందేళ్ళ క్రితమే తెలుగు ప్రజలకు రాజకీయ సరిహద్దులు లేకుండా ఉత్తరాంధ్ర స్ఫూర్తిని ఇచ్చిందని అన్నారు. చాసో కథలు సార్వకాలీనం, సమకాలీనం, సందేశంతో కూడిన కథలని అన్నారు. చాసో తక్కువ రాసి ఎక్కువ ఆలోచింపచేసిన కథకుడన్నారు. ఆచార్య ఎండ్లూరి సుధాకర్ మాట్లాడుతూ చాసోను మొదటిసారి చూసినప్పుడు ఓ కథను చూస్తున్నానా అని అన్పించదని అన్నారు. జీవితంలోంచి కథ రావాలి. కథ సజీవంగా ఉండాలి. అనుభూతి సజీవంగా వుండాలి అన్నదే చాసో గాఢ నమ్మకమని అన్నారు. దేవరాజు మహారాజు చాసో పురస్కార గ్రహీత శశిశ్రీ సాహిత్యంపై విశ్లేషణ చేశారు. పురస్కార గ్రహీత శశిశ్రీ స్పందిస్తూ ప్రొద్దుటూరులో జర్నలిస్టుగా ఉన్నప్పుడు చాసోను ఇంటర్వ్యూ చేసినప్పుడు కథల టెక్నిక్ తెలిసిందని, చాసో దశ దిశ నిర్దేశించే రచయితని అన్నారు. చాసో స్ఫూర్తి వ్యవస్థాపకురాలు చాగంటి తులసి వివిధ ప్రాంతాల నుండి వచ్చిన సందేశాలను చదివి వినిపించారు. చాగంటి ఆనంద్, శ్రీమతి చీకటి చంద్రికారాణి, చీకటి దివాకర్ తదితరులు ఈ కార్యక్రమ నిర్వహణలో పాల్గొన్నారు.

# శుక్లా మినీ కవితా సంకలనం ఆవిష్కరణ



డిసెంబర్ 27న విప్లవ్‌దత్ శుక్లా 'విపుల' మినీ కవితా సంపుటి ఆవిష్కరణ దృశ్యం

డిసెంబర్ 27న డా॥ విప్లవ్‌దత్ శుక్లా రచించిన "విపుల" మినీ కవితా సంకలనాన్ని, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డా॥కె. శివారెడ్డి ఆవిష్కరించారు. తొలి ప్రతిని కవి, విమర్శకులు డా॥ అద్దేపల్లి రామ్మోహన్‌రావు స్వీకరించారు. ఈ సందర్భంగా శివారెడ్డి మాట్లాడుతూ, మారుతున్న సమాజంలో కవులు కాలంతోపాటు కవిత్వాన్ని కొత్తధోరణులలో నడిపించి మన సంస్కృతిని కాపాడినప్పుడే సమాజం బాగుపడుతుందని, వివిధ ఉద్యమాలు, వాదాలు కవిత్వానికి జీవం పోస్తున్నాయని అభిప్రాయపడ్డారు. కవి విమర్శకులు డా॥ అద్దేపల్లి మాట్లాడుతూ ప్రపంచీకరణ సమాజాన్ని నిశ్శబ్దంగా ఛిన్నాభిన్నం చేస్తున్న దశలో, కవులు, బాధ్యతగా వ్యవహరించాలని సూచించారు. డా॥ శుక్లా రాసిన మినీ కవితలు చైతన్యవంతంగా, ప్రగతిశీల భావాలతో వ్యక్తిని, సమాజాన్ని కూడా దృష్టిలో పెట్టుకొని రాసినవని, కవితలకు వేసిన బొమ్మలు సందర్భోచితంగా ఉన్నాయని అద్దేపల్లి కొనియాడారు. సభ ముగింపులో డా॥ శుక్లా తనను ప్రోత్సహించినవారికి కృతజ్ఞతలు తెలిపారు. ఈ కార్యక్రమం జనమిత్ర ఫౌండేషన్ ఆధ్వర్యంలో సత్యభాస్కర్ అధ్యక్షతన జరిగింది. ఈ కార్యక్రమానికి తంగిరాల చక్రవర్తి, డా॥ యాదయ్య, శ్రీకాంత్, తదితరులు హాజరయ్యారు.

## గమనిక

డైరీ కాలమ్‌కి సాహిత్య వార్తలు పంపేవారు క్లుప్తంగా రాసి పంపాలి ♦ సభలో పాల్గొన్న వారందరి పేర్లు రిపోర్టులో రాయకూడదు ♦ ఆలస్యమైన వార్తల్ని పంపించకూడదు ♦ తాజా వార్తలకే ప్రచురణకు అవకాశం ఉంటుంది ♦ మాకు చేరుతున్న కొన్నింటిలో తేదీలు రాయడం లేదు ♦ ఫొటో వెనుక తప్పని సరిగా ఆ కార్యక్రమం జరిగిన తేదీ, ప్రాంతం, జిల్లా పేర్లు రాయాలి.

## 'శ్రీశ్రీ జయభేరి' ఆవిష్కరణ

కర్నూలు జిల్లా సాహితీస్రవంతి ఆధ్వర్యంలో కర్నూలు పట్టణంలోని కెకె భవన్‌లో జనవరి 17న సాహిత్య ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి రచించిన 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ సభ జరిగింది. ఈ కార్యక్రమంలో ప్రముఖ కవి, సాహితీస్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు వల్లభాపురం జనార్దన ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. శ్రీశ్రీ జీవితం, రాజకీయాలు, సాహిత్యం అంశాలను లోతుగా అధ్యయనం చేసి విశ్లేషించి శ్రీశ్రీని అన్ని కోణాల్లోనూ చూపే ప్రయత్నం 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకంలో జరిగిందని ఆయన అన్నారు. వర్ధమాన కవులకు శ్రీశ్రీ రచనలు స్ఫూర్తిదాయకమని, సామాజిక స్పృహ కలిగిన రచనలు తెలుగు సాహిత్యానికి శ్రీశ్రీ అందించారని కొనియాడారు. సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు మాట్లాడుతూ ప్రజల బాధలను తన బాధలుగా కార్మిక కర్షక పక్షపాతిగా శ్రీశ్రీ రచనలు చేశారని అన్నారు. ఈ ఆవిష్కరణ సభకు సాహితీస్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ అధ్యక్షత వహించారు. అనంతరం 'రైతు' అంశంతో జనకవనం జరిగింది. రైతులు ఎదుర్కొంటున్న సమస్యలు, రైతుల ఆత్మహత్యలు, రైతులకు మనోధైర్యం, ఆత్మవిశ్వాసం కలిగించే వివిధ అంశాలతో కవులు తమ కవితలను చదివి వినిపించారు.



జనవరి 17న కర్నూలులో జరిగిన 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ సభలో వల్లభాపురం జనార్దన, కెంగార మోహన్, జంధ్యాల రఘుబాబు

ఈ జనకవనంలో ఆదోని, డోన్, ఎమ్మిగనూరు, నందికొట్కూరు, కర్నూలు పట్టణం తదితర ప్రాంతాల నుండి కవులు పాల్గొని స్వీయకవితలను వినిపించారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి కర్నూలు జిల్లా సహాయ అధ్యక్షులు మహేష్, జిల్లా నాయకులు అయ్యన్న, గౌరవ అధ్యక్షులు నిస్సార్ అహ్మద్, నల్లారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## శ్రీశ్రీ రచనల్లో మార్గనిర్దేశం

శ్రీశ్రీ రచనల్లో సామాజిక వాస్తవంతో పాటు మార్గనిర్దేశం ఉందని పలువురు వక్తలు విశ్లేషించారు. విజయవాడ స్వరాజ్య మైదానంలో ఏర్పాటు చేసిన పుస్తక ప్రదర్శనలో శ్రీశ్రీ జీవిత సాహిత్య రాజకీయ సర్వస్వం 'శ్రీశ్రీ జయభేరి' పుస్తకావిష్కరణ జరిగింది. ప్రజాశక్తి బుక్‌హౌస్ సాహితీ స్రవంతి సంయుక్తంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాయి. ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ ప్రధాన కార్యదర్శి గోళ్ళ నారాయణరావు ఆవిష్కరించారు. ఆయన మాట్లాడుతూ శ్రీశ్రీ రచనలు ఎంతోమందికి మార్గదర్శకంగా నిలిచాయన్నారు. శ్రీశ్రీ రచనలు అందరూ చదవాలన్నారు. ప్రముఖ సాహితీ విమర్శకులు కడియాల రామమోహనరాయ్ పుస్తకాన్ని పరిచయం చేశారు. తెలుగు సాహిత్యానికి శ్రీశ్రీ 21వ శతాబ్దపు వరం అన్నారు. ఆయన ఎంతటి గొప్ప కవో భారతీయులందరికీ తెలియాలన్నారు. శ్రీశ్రీ జీవితం, సాహిత్యంపై ఎంతో మంది ఎన్నో రకాల పుస్తకాలు, కవితలు రాశారనీ, కానీ తెలకపల్లి రవి మాత్రం సమతుల్యతతో, చారిత్రక దృష్టితో ఈ రచన చేశారని చెప్పారు. శ్రీశ్రీ రాసిన మొదటి పాట



'జయభేరి' పుస్తకావిష్కరణలో గోళ్ళ నారాయణరావు, రామ్మోహనరాయ్, తెలకపల్లి రవి, ఎస్. వెంకట్రావు

జయభేరి శీర్షికతో రాయడం విశేషమన్నారు. సభకు సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్. వెంకట్రావు అధ్యక్షత వహించారు. సాహిత్య ప్రస్థానం సంపాదకులు, "శ్రీశ్రీ జయభేరి' పుస్తక రచయిత తెలకపల్లి రవి తదితరులు సభలో పాల్గొన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# ముఖ్దూం మొహియుద్దీన్

(04.02.1908-24.08.1969)



హైదరాబాద్‌లో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు. తెలంగాణా పోరాటానికి తోడు నిలిచిన యోధుడు. ప్రసిద్ధ ఉర్దూ కవి, వక్త.

SAHITYA PRASATHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



# సాహిత్యకారులకు, పుస్తక ప్రియులకు సరికొత్త కానుక!

పేజీలు 356
అరుదైన ఫొటోలతో...

# శ్రీశ్రీ జయభేరి

## జీవితం-సాహిత్యం-రాజకీయాలు

## తెలకపల్లి రవి




సామ్యవాదమే నా గమ్యం కవిత్వంలోనూ జీవితంలోనూ అన్న శ్రీశ్రీ కవిత్వం భువన భవనపు బావుటాగా ఎగురుతూనే వుంది. శ్రీశ్రీ జీవితాన్ని, సాహిత్యాన్ని, రాజకీయాలను సమగ్రంగా, వాస్తవికంగా పరిశీలించిన పుస్తకం ఇది. ఆయన స్వీయరచనలు, సమకాలికుల జ్ఞాపకాలు, రాజకీయ చారిత్రక పరిణామాలు, ఉద్యమాల, సంఘాల పూర్వాపరాలు ఒకేచోట చూపించే విస్తృత ప్రయత్నం. శ్రీశ్రీ అశేషాభిమానులకు, అభ్యుదయ గాముకులకు ఆసక్తి గొల్పే రచన.

**ప్రతులకు:**

ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో

హైదరాబాద్- 040 - 27608107, ఖమ్మం- 9959700852, నల్గొండ - 08682-230525,
హన్మకొండ- 0870-2544559, విజయవాడ- 9490099060, విశాఖపట్నం-9490099061,
గుంటూరు- 9490259186 తిరుపతి- 9490099062, ఒంగోలు- 9490300359,
హైదరాబాద్- ఎస్.వి.కె. బ్రాంచ్- 040-27667543

వెల: రూ. 100/-

ప్రత్యేక తగ్గింపు 25%

**వెంటనే కొని చదవండి!**

50



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A124 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |